వార్షి. చందా రూ. ౩.      రిజిష్టర్డు ఎం. ౯.

1924



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

సంపుటము ౧౦ { దుర్మతినామసంవత్సరము. ఆశ్వయుజకార్తికమాసములు. } సంచిక ౪.

## ప్రధానవ్యాసములు.

# కర్ణాటరాజ్యవృత్తాంతము

(ఉత్తర భాగము.)

---

## అవతారిక.

[ఈ వృత్తాంతము కలకత్తాకైతపుగ్రంథము పరిషత్పుస్తకభాండాగారమందున్నది. దీని సంఖ్య ౩౯౧౭. మనపల్లిగ్రామములో దొరకినది. ఇందు, తాళికోటయుద్ధము, తరువాతివృత్తాంతము కొంత వర్ణింపఁబడినది. కథ పూర్తి కాలేదు. కొన్నివిషయములు యథార్థములుగా నున్నవి. కొన్ని పుక్కిటిపురాణములుగూడఁ గలవు. పూర్వాపరసంబంధము చక్కఁగఁ బాటింపఁబడలేదు. భాష సలక్షణమైనది కాదు. ఇన్నిదోషములున్నను విషయము దేశచరిత్రపరిశోధకుల కుపకరించు నను నూహతో గ్రంథ మున్నదియున్నట్లే ప్రకటించినారము]

శ్రీరస్తు.

శ్రీమద్రాజాధిరాజ తేజోనిధి రాజకందర్ప రాజకంఠీరవ అమరాయర గండాంక రాజమనోభయంకర। శశివంశకులపావనా। ధామా। ఆత్రేయగోత్ర ఆపస్తంభసూత్ర రమణచరణకమలని కేతన పూర్వసింహాసనోద్ధారణ శ్రీరాజపరమేశ్వర। యేకపవిశోభ్రదయ। శ్రీమద్రాజాధిరాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరవెంకట। పిన్నముకానల్లూ రాజ్యంలోగాను గుండాండమనేపట్నంబనేది లక్షరాజ్యంతాణా వేసుకొని స బాంధవజ్ఞాతిస మేతముగా రాజ్యభారంచేస్తువుండగాను తోరకంట్టినరసరాజువారియంట్టి తిమ్మమ్మగార్ని వివాహంచేసుకొని యీ యంమ్మయందు కుమారుడు శ్రీరంగరాజు నంద్యాలతాణా వేసుకొనివుంన్డ్రి। అంబళాదేవి। చెల్లాదేవి। ఆనంద్యాల నిజరాజ్యధానిగా రాజ్యపరిపాలన చేస్తువుంన్డ్రి। వారికుమారుడు రామరాజు అనేఆయనా। కందనూలు తాణా వేసుకొని ప్రభుత్వంచేస్తూవుండెను। మూడో ఆయన నారసింహ్మారాయలువారు కుతుపశాయివారిమీాదను। గజపతివారిమీాదను మోహరంచాయగాను। యీ బుక్కరాజున్ను। నాల్గువేల ముసల్మాను రాచిరికెమున్నూ। రెండువేలా యెనూరు క్రిష్మవెలమలూన్ను। అల్లుండ్లు ౪ కుమాల్లూ మున్నూటితోను నారసింహ్మా రాయలవారితోను ఢిల్లీ ఆప్రాంత్యమునకు గమనంచేసిరి। కుతుబ్ శాపాచ్చాయి వారి మొనవిరిగినంత బారా వో గజపతివారి ఫౌజువారికి సహాయమువచ్చి యెది

రించి యుద్ధంచేసేయెపల రాయలవారిఫౌజు విరిగివచ్చి నర్మదాతీరం చేరినంతలో బుక్కరాజువారు స్వజనంఫౌజుతోకూడా యెదిరించినిలిచి కుతుబ్‌శావారిని సహాగాను గర్వభంగము చేసి పలాయనము చేసినందున రాయలవారికి శ్రేయస్సు వచ్చెగనుక నారసింహరాయులవారు మెచ్చి వీరికి లక్షరాజ్యము కాక। ఆరవీడు। కందనూరు। అనేడిస్థలాలు రెండులక్షలరాజ్యము జహాగీరు ఇచ్చి మీరు సభాముఖమందువస్తేను మీకు మర్యాదలు మాకుమాళ్లు అచ్యుతరాయులు। ప్రౌఢదేవరాయులు। వారితో సమముగా కూర్చునేటట్టునిర్ణయించి। మాఫౌజుకు ప్రథమజంపా నడచేటట్టు నిర్ణయించి అంపించిన వెనుక। ఈరెండుసర్కార్లు చేసుకొని సుందీలుహోజీలకన్నా మేలుగా వెల్గోటి యాచమనాయనిగారు। పెమ్మసాని తిమ్మానాయనిగారు। యీనాల్గు మన్నెరికాలుకన్నా అండెంహీరె బసప్పనాయకపజీరుకన్నా అతిశయముగాను। నడిపిస్తూవున్నారు। యేతక్షణం నిమిత్యముగాను। స్వజనబంధు నల్గురిపెద్దల పిలువనంపించి యేకాంతంచేసి వారితోను। రా॥ బుక్కరాజుగారు పలకరించిన వివరం। నారసింహ్వరాయుల వారు బహుమానపురస్కరంగాను। మాకు మర్యాదలు చేసినారు గనుక మీరు నల్గురి దయావిశేషంచాతను ఫేషక్కు పొందినారం। కాగా మీరు మాకు వఘు పెద్దతనం నడిపించవలసినదని అడిగినందున ఆబుక్కరాయులవారితోను నల్గురు బంధూలు అనిన వివరము మనవాళ్లలోను నీవు ఆరవేటి బుక్కరాజవు। దశావంతుడవు। మీకు మేము మర్యాద యిస్తున్నారం యీవస్తు క్షత్రియజాలమునున్ను। మొక్కచాయంగలవిన్నపాలు అని వుత్తరంలో - రాసుకుంటున్నారం। మీకు మా పేర వ్రాయించవలసితేను దీవించి వ్రాయించినప్రయోజనం। అని నిరూపంవ్రాయించవలెను। అని నల్గురుబంధూలు పేషక్కు యిచ్చిరి। ఆపిం మట మహారాజులగాను రాయలవారి చిత్తం సంపాయించుకుని। సబాంధవసపరివారయుక్తంగాను రాజ్యంచేస్తూవుండగాను ఈబుక్కరాజుకు పెద్దరామప్పయ్యగారు జననమైరి। యీరామరాజుగారు కందనూరులో ప్రసిద్ధిగా రాజ్యంచేస్తూవుండిరి। వీరికి తింమ్మరాజు। శ్రీరంగరాజు। రామరాజు। తిరుమలరాజు। వెంకటపతిరాజుగారు। అయిదుగురుకుమాళ్లలోగాను కృష్ణరాయులవారి పట్టం అల్లుడు రామప్పయ్యకు లభ్యమాయను। యువరాజ్యపట్టం తిరుమలరాయులకు యిచ్చెను। కడప ముగ్గిరిలో కందనూలు వెంకటపతిరాజుకు యిచ్చెను। రాయవేలూరిలోను తిమ్మరాజును వుంచెను। గుర్రంకొండ। బెల్లంకొండ। కంభం। కాకర్ల। పెనుగొండ। సహగాను కోనేటిరాజుగారికి యిచ్చెను। తాము యేకపత్నివ్ర

తుండ్రై రాజ్యంచేసెను। యింతలోగాను యిరవైపక్క మూగు కుతుంబ్ శాయిఅనే
నిజాముదు। పాదుశాయి అనేనిజాముసు రాజా అనే రజపుత్ రాజును మహా
రాష్ట్రులసహాగాను విముఖంచేసి నర్మదకు అవతల మున్నూయేడు యోజనముల
దూరము రాజ్యంసాధించి అవురంగాబాదు పాచ్ఛాయి ఫేటేఅయి ఢిల్లీపట్న
మందు తనుదు రాయముద్రలు నడిపించి నర్మదఆవల మున్నూయేడు యోజనాల
దూరం రాజ్యంసాదించినగుర్తు। జయస్తంభంనాటించి। యీలాగున యాభై
యారు సంవత్సరములు రాజ్యంచేసి వకనాడు। కపిలావతారం యోర్ద్ధ్యే। వుత్తర
వాహినిగాను। తుంగభద్రలో గంగప్రవహింపుచున్నది నేడు భాగీరథిఅనేపర్వ
ణిదినంగనుక స్నానానికి। పోవలెనని యోచించి నంద్యాలకుమారనారశింహరాజు
అవుకువిఠల్ రాజు। కందనూలితిర్మలరాజు। కుమారశ్రీరంగరాజు। భీరవోలు
రమణరాజు। అపరచింతలవెంకటనారాయణరాజు తమసహోదరులలో కోనమ
రాజు। తిరుమలరాజు। వెంకటపతిరాజు। మూల్రాజుపెద్దవోబరాజు। పోచిరాజు
వెంగమరాజు। గుత్తివెంకటపతిరాజు। కురుచెటిచిన్నగోపాలరాజు యిందరి
తోను రిష్యమూకందగ్గరనదిదాటి హనుమనశెలనలోను దిగి అంజనాదేవిపర్వ
తందగ్గర అరణ్యానుకు వచ్చి సందనవనానుకుపోయి స్నానసంధ్యావందనాదులు
దీర్చి। భూసురులకు గోహిరణ్యభూమి అగ్రహారాదిదానములు యిచ్చి భూసు
రాశీర్వాదసంపన్నుండై యీయరణ్యం ఛేదనంచేసి పురప్రతిష్ట చేయించినట్లైతే
గోప్యమైనస్థళాలు దుర్గాలుఅవును। చినమేగోట పెద్దమేగోట చెంచలకోట
అనేనామధేయములుకల దుర్గాలు ప్రతిష్టగావించి మనకోనమరాజును వుంచు
దామని నిశ్చయంచేసి తిర్మలరాయలను పిలువనంపించి మలికీవిభురామును వృథ
యత్రులమీరు యిందులనిలచి ఈయరణ్యంఛేదనంచేయించి పట్నంనిర్మింపమని
బుద్ధి. ఆనతియ్యగా అదేప్రకారముగా వీరునిలచి పట్నంగోపురప్రాకారాదులు
నిర్మించి మూడువేలయేనుగలను అచ్చటవుంచి కోనమరాజుఅధీనముచేసి కోన
మరాజుక్రింద నడిచిన సర్కారుయిస్తువులున్ను యేనుగులకుయిస్తువు కు
గ్రామాదులున్ను యిప్పించి యీప్రకారం మర్యాదలుచేసి అచ్చటనియమించిరి
యిందులోవకవిశేషం మాపెద్దలుచేసిన సుకృతావిశేషమువల్లను నాయొక్క
పూర్వజన్మసంస్కారపూజాఫలము వల్లనో నల్గురుబంధువుల అనుగ్రహమువల్లనో
నాకు రాయరాజ్యాభిషేకం పదవి అనుభవమాయను యిది నరపతిసింహాసనం
పూర్వం తులవరాజులతోను నడచినమర్యాదలు నడతలు మనము వృత్తిక్షత్రి
యులమైయుండి మాతరాలలోనే అప్పటిరామరాయలగారు ఈ అతిశయమైన

నడితి నడిపించినాను గనుక నాతంములకు పుత్రరములు వ్రాస్తేను మూలపురుషు డైన పెద్దరామప్పయ్యగారి పేరు ముందుగాచెప్పండి మా అల్లుండ్లకు జాబులు వ్రాస్తేనో దీవించిపుత్తించినప్రయోజనం అనివ్రాయండి మీరు మాయింటితె నానుకు మాబుక్కరాజుగారికి బిరుదుయిచ్చివున్నారు అదేప్రకారం మాతం ములకు మాకొమాళ్లకు నడిపించండి మీరువ్రాస్తే మొక్కిచాయంగల విన్న పాలు అనివ్రాస్తూవచ్చేది అని నిష్కర్షచేసి అల్లుండ్లకు కుమార్లకు కొన్నిగడి స్థళాలున్ను దుర్గస్థళాలున్ను యిచ్చి తాము రాజ్యభారంచేస్తూవుండెను రామ ప్పయ్యగారికి నిస్సంతతి అయినందున తంముడు తిరుమలరాయలుగారికి పట్నం గట్టిరి । వీరికి రఘునాధరాజు । శ్రీరంగరాజు । వెంకటపతిరాజు రామరాజుగారు నల్గురుకుమాళ్లు గలిగియుండిరి యిదివరకు రామప్పరాయలవారికి అరువైసంవ త్సరములు ఆయును యిదివరకు సకలసాంబ్రాజ్యసుఖాలు అనుభవమాయును యిఘమీాదట పుత్తమక్షత్రియులమైయుండి రోగాలచాత గృహాములో చావ రాదు అని వుత్తమక్షత్రియులకు యుద్ధమందు మరణశ్రేష్ఠమని పూర్వంరాజులు భీష్మాదిరాజుల మరణాలు విచారించి నలుగురుబంధువులను తంమ్ములకొమాళ్లను మన్నిరికాలు రాయలవారి అల్లుండ్లను వజీర్లు దళవాయిసర్కార్ల పిలపించి యోచనచేసినందున వారు మనవిచేసుకొన్నవివరం మనవంశమందు వెయిన్నిము న్నూట యెనభైయింటికి రాజ్యభారంచేసి చనినరాజులయందు యేరాజు మీా వలె ప్రసిద్ధికిరాలేదు ఈనాటికి మీారు సాక్షాత్తు రుద్రాంశసంభవులు గనుక నర పతిసింహాసనం లభ్యమాయను కొనకు మీాతోనే యీామహదైశ్వర్యం సరి కావలెనని అభిలాషవున్నట్టు అయితే మీాచనుకు సరినచ్చినట్టాయనా దేవర వారు సత్యసంధులు అభిజ్ఞులు తమచిత్తానుకు తెలియనది యేమివున్నది అని మీారు తలచినకార్యం యుక్తంకాదు అని మనవిచేసుకున్నందున మీారు అందరు నాకు శత్రువులు యిందుకు మీారు అడ్డీచేయు పనిలేదు అని చెప్పనందున వారు వూరికెవుండిరి । అపుడు మలికివిభురాం అనేవాడు గోలకొండ కిలేదారుడు । రాయలవారిపై జాలరుపట్టేవాడు । ఆబాల్యాను నుంచి చాకినవాడు । గంధర్వసంభవుడు । పాటయందు అసాధారణప్రజ్ఞగల వాడు । వాణ్ణి పిలిపించి వోరీ నిన్ను బాల్యాననుంచి సాకి పెంచినాను మా చిత్తానుసారం నడుచుకోరా అని బుద్ధిశలవుయివ్వగా వాడు అనినవివరం దేవరవారి ఆజ్ఞలోగా గోలకొండరాజ్యము విచారిస్తూ మీాపైజార్లు శిరసావ హించి వున్నాను నాశరీరం తమ ఆధీనము మీారు హేమిహుకుం ఫర్మాయిస్తు

న్నారో ఆశలవులో హాజరుగా వున్నాను అయితే ఇప్పుడు మాశరీరం యుద్ధ
మందు విడవవలెనని వున్నారం ఏతన్నిమిత్యం తురకలుకు రోషంపుట్టేటట్టు
డిల్లిలో మాపేరట ధ్వజస్థంభంవేసి మక్కాలో పండిసికోసి మొగలాయిలస్కరు
తీసుకరంమని అంపగాను మలికివిభురాం ఢిల్లీకిపోయి ధ్వజస్థంభంవేయించి
మక్కాలో ఈప్రకారం అగత్యంచేస్తూన్నాను నాకు మాయేలిన రామరా
యలవారి హుకుం అయినది మీకులభిమానం వున్నట్టు అయితే నన్ను మీరు
పట్టుకొని రామరాయలవారిమీదను కత్తికట్టి దండు నడిపించండని దూరుశా
యగా నాలుగులక్షల గుర్రము యేడులక్షల కాల్బలము కూర్చుకొని బాచ్ఛా
యి ఫౌజువచ్చి రక్తస్తంగడి దగ్గరనుదిగి రామరాయలవారికి చాలుమనుష్యుల
పేరట వుస్తరములు అంపించగా రామరాయులవారు ఆవుస్తరములు నఖాగ్రమందు
బెట్టక పాదుశాహిని వుదాశీనంచేసి పైజార్లతోను వేయింతుమని అంపించే
వరకు పాదుశాహికి కోపంబుట్టి రామరాయులవారి తల నా ఝూండాకు కట్టిం
తును లేదా నాతల వారిజెండాకు కట్టించువలసినదని శపథంచేసి పాచ్ఛాయి
వారు తమఫౌజుకు హుకుంచేసి దేశం లుటాయించమని శెలవిచ్చినందున వారి
ఫౌజు దేశం నిపాతంచేయగా యావత్తుబంధువులు వచ్చి మనకువారికి వివాదం
వద్దనగాను యిదివరకు పెద్దలు యేహద్దున నడిపించిరో అదేప్రకారం నడిపించుక
వచ్చేది యుక్తముగావున్నదని యేలినవారికి మనవిచాయగా ఆవార్తలు అంగీకారం
చాయకపోయినందున యిఘుపత్తిడిగా మనవిచేస్తే స్వామిద్రోహంవచ్చిఘటిస్తున్న
దని వూరికవుండిరి విజయనగరంలో రాజాధిరాజశ్రీ రామరాయలవారు ఢిల్లీ
పాచ్ఛాయివారిమీద దండువెడలేటప్పుడు పట్నంలోను రణభేరివేయించి యు
ద్ధము నిష్కర్షచేయించి తలిఃపొయ్యేటప్పుడు శ్రీ అన్నగారు కోనేటిరాయల
వారిని పిలిపించి మేము రణమునకుపోవుచున్నారం మీరుయిక్కడ వుండవద్దు
రాయవేలూరికి తలిఃపోయి పూర్వశింహ్మాసనం వుద్దరించుక శ్రేయోవంతుడవై
మూర్ధాభిషిక్తుడవై వుత్తరోత్తర అభివృద్ధిగాను వర్ధిల్లుమని శెలవుయిచ్చి ఆపి
ష్మట బంధువులను రాచరికాన్ని కమ్మవెలమవారిని రౌతులను మరాటీలను
పాతరికాలను సమస్తమైనపాళేగాండ్లను పిలువనంపించి మీరు యిండ్లమీదను
పెండ్లాముబిడ్డలమీదను ఆసక్తివున్నవారైతేరా మీమీసంబళాలు మీయిస్తు
వలు మీగ్రామాదులు మీ అమరాలు నడిపించమని మాకోనమరాజుగారితో
శెలవుయిస్తున్నారం అదేప్రకారం మీరున్ను కోనమరాజువారితో కూడా రాయ
వేలూరికిపొమ్మనగా వారు అనినవుత్తరం (స్వామికార్యహతంప్రాణం అంత్యం

దృష్టోపమాధనః) అనేన్యాయం వున్నది మేము విడిపిపోవుట వీరిగర్వమా విూ రక్తం పడినచోట మాశిరస్సులు పడవలసినవని విశ్వాసపూర్వకముగా మనవిచేసు కొనిరి - గనుక - కనకభేరీనగారా కూచచేయించి - రాయలువారు ఆరుమజిలీలు తలక్రిందు రక్తస్తంగడి అనేపట్నం యెమునానదీతీరానవున్నది ఆడకుచేరి తాము ఆవలిగడ్డకువత్తుమా మీరు యీవలిగడ్డకువస్తున్నారా అని అగుపరపాచ్చాయి వారికి చాలుమనుష్యులకు జాబులు వ్రాయిస్తేను తురకలు చాలుమనుష్యుల పేరిట మీరే నదిదాటి రమ్మని వుత్తరములు వ్రాసుకొనిరి.

కాగా వీరు నదిదాటి రెండుమజిలీలు సాగిపోయి సాల్‌సామానుచేరే పర్యంత్తం మొఖాంచేసి అచ్చట తిరుమలరాయులవారి పార్శం కొందరకు సర దార్లు ధళవాయులు మన్నెరికాలు నాయకవాడిలు యాభైయేను వెలు నల్బై యెనిమిదివేలు వెలమవారు పదివేలబల్యాలవారు యెలుగోలు యిరువైయెనిమిది వేలు పెంమసానిరామలింగమనాయునివారి స్వజనం బంధువర్గమువారిపముజు యాభైఅయిదువేలు యీటిలు బల్యాలు తుపాకిపౌంజు యిరవైవేలు రావిల్ల బుచ్చినాయునివారు పదివేలబల్యాలవారు పదివేలతుపాకి జగదేవిరామప్ప య్యనాయుడు పదిహేనువేలశిన్వ యెనిమిదివేలతుపాకి తురకలు। యాకూబుసా హేబుఅనే జమేదారుడు యాభైవేలగుర్రం మహారాష్ట్రులు బొబ్బిలిరాజువారి గుర్రంపౌజు యాభైవేలు అభుసీలుయిరువైవేలు గాడిలు తోపులు ఫిరంగీలుసహా యిరవైవేలగుర్రం కాసాకురికంయిరవైవేడువేలు కైజీతం యిరువైవేలు నగిరికు మూరికంయాభైవేలు అల్లుడుకొమార్లు త్వరగంటినరశింహరాజు ఆయనతమ్ములు భోజరాఘువరాజు గొబ్బూరుఅచ్చుతరాజు ఆయన కొమారుడు దానపరాజు। తరమెల సంబెటజనపాలరాజు కుడిచేతి విజయనారాయణరాజు కుమారిపట్టాభి రాజు నంద్యాలపెనుగొండతిర్మాతరాజు భీకోలురాఘువరాజు వాకుగోపాలరాజు ఆపెద్దతిమ్మరాజు గుత్తివిఠలరాజు వీరుస్వజనం వీరిపౌజును ధళవాయిలింగొబా నునిపౌజుకూర్చి యుద్ధానకు పంపించిరి రాయలవారి హుకుంకాగానే యేకార్ణ సంగా నముద్రముపొంగినట్టు రెండుపౌజులు యుద్ధముచేశేనరకు సముద్రముతాకి నట్లు యుద్ధముచేశిరి రాయలవారిపౌజు అంత యేకమొకముగా పోనందున యెదటి విస్తారం గుర్రంపౌజు అయినందున వీరు తుగుడీలుచేసి పంపించినందున బలంచాలక బహుమంది నిపాతంచేశి అగ్నిలోపడిన మిడుతలువలెను హతమైరి రెండోసారి నగారాకూచిచేయించి కొంతపౌజును యుద్ధానకుపంపించినంతలోను బంగము ఆయును యీలాగున యిరువైరెండు ఆవర్తల సరదార్లనుకూర్చి పౌజును

జమాయింపుచేసి పంపించేవరకు । యుద్ధముచేసి యెదటవారిని బహుమంద్ని
హతముచేశి తాము హతమైపోయిరి । యిరవైయవసారి శ్రీమద్రాజాధి
రాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాపులైన రామరాయలవారు తక్కినబంధువు
లున్ను కౌతులు యాభైవేలు మరాటీలు లక్ష కస్తూరికం నలభైవేలు యిలవ
రికం ముప్పైవేలు రాచరికం తొంభైవేలు కానాకుమారికం డెబ్బైవేలు
ఆశ్వాలు యాభైవేలు యేనుగులు యిరవైవేలు అందులో ప్రసిద్ధమైన యేను
గులు కోలాహలరాయుడు అనేది యేనుగగజరాజు అనేయేనుగ శేషాచలం
అనేయేనుగ చతుర్దంతి అనేయేనుగ కాసాయేనుగులు నాలుగింటికి నిండు
జీనాలున్ను కొమ్ముకత్తులున్ను అంబారిముస్తీపుతోను గుర్రాలలోను పంచ
కల్యాణి అష్టమంగళి పగలుచుక్క జయలక్ష్మి అనేవి కాసాగుర్రాలునాల్గు జీరా
భక్తను తొడిగించి తెచ్చి ముందరనిలిపినవేళను రాయలవారు యుద్ధానకు
ప్రయాణంశిద్ధంచేశి రణజర్జరీకం అనే భేరివేయించినందున అపశబ్దం గణపత్తు
రణనత్తు అనే అపశబ్దం పలికినందున స్వకీయులు పరకీయ్యులు విని సాలదోలా
యమానులై రాయలవారికి విన్నపంచేసిరి మనఫౌజుకు యేకోను యేకముఖం
చేసి యుద్ధానకు సెలవుయియ్యకపోతిరి తుగడీలుచేసి యిరవైయవమార్లు
సెలవుయిస్తిరిగనుక మనఫౌజు చానాహతమాయెను (యిప్పుడు కాసాగా
యుద్ధానకు సన్నద్ధులు అయ్యి రణభేరివేయగ అపశబ్దంధ్వనియిచ్చెను కాగా
దేవరవారు యిచ్చటనిలువండి మాకు సెలవుయివ్వండి । యీసారికి తురకల
ఫౌజును హతంచేస్తున్నాము అని మనవిచేస్తేను రాయలవారు శరీరం యుద్ధ
మందు వినియోగమయునని అభిలాషచేత వీరి మనవికి హాతంచేసిరి అంద్కు వీరు
మనం శావకమాత్రంవారము స్వామికార్యహతంప్రాణం అనేన్యాయముచే
తను పూరికెవుండిరి అందుమీద రాజాధిరాజశ్రీ రాయలవారు శాభోగమా
చేసుక తెచ్చిన జయలక్ష్మి అనే గుర్రాన్ని చూశి కంఠం అప్పళించినందున అవశ
కునంగాను కన్నుల నీళ్లుబింద్ధువులురాగాజూచి జితేన అచ్యుతేలక్ష్మి మృతే
నాలసురాంగణం । క్షణవిధ్వంశినిధికాయే కాచింతామరణేరణే అనేశ్లోకం
చప్పగానే సమ్ముఖమై ఖురఘట్టణచేశి పుచ్ఛాహాపడి యుద్ధాన్కు సమ్మతమా
యను రణోత్పాతన మనేచతుర్దంతి అనేయేనుగను జీరాభక్తను అంబారి బత్తి
స్సాయుదాలు ముస్తీపుచేశి తీసుక డేరాముందుగా సముఖాన్కు తెచ్చినిలిపి
మనవిచేయగా అంబారియెక్కి యుద్ధాన్కుపోయి బహుయుద్ధంచేసి పవుజు
హతాహతులైనపిమ్మట యదట తురకలపవుజును నిపాతంచేశి రా॥ రామరా

యులువారు శత్రువులకు చిక్కవలయును అని అభిలాషచేతను రణమందు శరీరంవిడిశిరి ఆమీదట పాచ్ఛాయివారు తమపరివారానకు తాకీదుచేయించిరికదా । విజయనగరంపట్నం చెరచవద్దు అని హద్దుయేర్పరిశి రామరాయులువారి కొమార్లు యవ్వరు అయినా వున్నారా అని విచారించినందున తిరుమలరాయునివారి కొమార్లు బంధువులు యావత్తుజనం విజయనగరపట్నంవిడిశి రాయవేల్లూరికి పోయిరి అని చెప్పినందున యిచ్చట ఆనేగొందిలోవున్న రామరాయలవారి అన్న కోనేటిరాజ్కు ఆనేగొందియేటికి ఆనల పంచ్చగ్రామాదులు యీవల పంచ్చగ్రామాదులు వుభయం రెండులక్షలవరహాలరాజ్యం యిచ్చి పాచ్ఛాయివారు రాయవేల్లూరికిపోయి చిన్నవెంకటపతిరాయులవారికి పట్టాభిషేకంచేయించి తీసుకొన్నరాజ్యం తిరుగాయిచ్చి రాయవెల్లూరు నిజధానిగాచేసి పాచ్ఛాయి తమదేశానికి పునర్గమనంచేసెను యీప్రకారం రాయవేలూరిలోను రామరాజ్యంచేస్తువుంటగాను నరసరాయులుకు గొబ్బూరుపోచిరాజువారి కొమార్తెను అడిగినందున ( వారు మంచ్చిది అని నిష్కర్షపరశివుండగాను ఆబంధువులైనా చిన్నపెద్దలుతోను యీనరసరాయులువారు అనినది నేను గొబ్బూరుపోచిరాజకొమార్తెను వల్లనూ । వారు స్వామిద్రోహులు అని వారిని నింద్ధించి తోరగంటి కొమారనరశింహ్మరాజు కొమార్తెను వివాహం చేసుకొంటువున్నాను అని వుంటగా యీమాటలు గొబ్బూరుపోచిరాజు విని మామీద రాయులవారు అపశబ్ధంచేసినారా అని వక్కనాటినిశీసమయమందు అంతఃపురం ప్రవేశంఅయి రాయులవారిసంత్తతికి వున్నమొగచిన్నవార్ని । ఆరాయలవార్ని మరణమొనరించేవరకు ఆకలాపంలోను పోచరాజువారి బోనకత్తె సుభద్రఅనేపేరిటిది గంగ్గమాంబకు అర్లెంగా పోచరాజువారు రాయలవారికి యిచ్చివుండిరి యీబోనగత్తె మహాబుద్ధిశాలిగన్కు ఆసమయమందు తిమ్మరాజు కొమారుడుఅయిన శిశువు మూడేండ్లచిన్నవాడు రామప్పయ్య అనే పేరుగలిగినవారిని యీబోనగత్తె తనమైలచీరనుదాచి సంక్కపెట్టుక వాకిలి చౌకీదార్లు అడిగితే మైలవస్త్రం చాకికివేయపోతువున్నాను అనిచెప్పి రామప్పయను కూడతెచ్చి సాకలతిమ్మనగాడు అనేవానికి రహస్యముగా యీవర్తమానం చెప్పినందున వాడు బుద్ధిమంతుడుగన్కు యీరాజును వెలుగోటియాచమనాయనిగారి స్తళానుకు చారపంచమనగా అదేప్రకారం తగినవార్లుచాత ఆశిశువునుయిచ్చి కాపాడుకుంటు దినదినమజిలిగాను వెంకటగిరిచేరి యీవర్తమాణం యాచమనాయనిగారితో చెప్పి యీరామారాయులువార్ని వొప్పజెప్పి సాకల

వాడు తమస్తలాన్కి పోయిను వారివద్ద శిశువు దినదినప్రవర్ధమానముగా వుంచు వుండెను యిక్కడ మొగవాండ్లును నగల్లో యెవ్వర్ని లేకుండా వధించ్చిరి ఆ స్త్రీలుమాత్రం వుండిరి అందులో వెంగటపతిరాయులువారి పెద్దభార్యకు పట్నానుకు అధికారంచేసి మీరు చిన్నవాన్ని దత్తు తెచ్చి యిస్తువున్నాము అని ఆ యమ్మకు సమాధానంచేసి తాము రాజ్యంఅంతా ఆక్రమించుకొని గొబ్బూరు పోచిరాజు వుండెను యీప్రకారం పన్నిండుసమత్సరములు వేలూరు ఆక్రమించుకొని అధికారంచేస్తువుండెను యింతలో చాకిమూట రామరాయలువారికి పదహారుసమత్సరాలువాడు అయి పూర్వ స్తలాలు గొబ్బూరుపోచిరాజుగారి అధీనమైవుంన్నని గన్కి వార్ని శిక్షించి అవుమాణతచాయవలయును అని యాచమనాయనిగారితో యోచనచాయగా వారు సహాసంతోషముని నాయని వారు పముజాలహాస్చక మరి అప్ర దేశముల పాళేగాండ్లను పిలుచుక తమకుల గురువులైన కంచ్చి తాతాచార్యులవారిసన్నిధకి వచ్చి సాష్టాంగదండములుసమర్పించి వారితో ఆగతసర్తమాణం తెలపగాను వారు మహాసంతోషపడి తాతాచార్యులు వారు చన్నట్నం వులిచేసినహావుంన్న వర్తకులు షాహుకార్లగుండాను కావలసినపదార్థములు తీసుకొని ఫౌజనుకట్టి తర్లివచ్చి రాయవేలూరు ముట్టడివేశి హస్తగతంచేసుక గొబ్బూరు పోచిరాజును పట్టుకొని అవుమాణత చేసెను ఆమీదట కపపరాజువారికన్యక రంగమాంబ అనేఆమను వివాహం చేసిరి వారికి సంతతిలేకపోయిను ఆరామరాయలు వేలూరులో యిరవైమూడు యేండ్లు ప్రభుత్వంచేసి వ్యైకుంఠస్తుడాయను ఆవేలూరుశింహ్హాసనాన్కి ప్రభువులేనందున అక్కడవుంన్న నల్లురుబంధువులు ఆలోచనచేసి ఆనేగొందికిపోయి కోనమరాజుగార్ని కనిపించుకొని మీకు ముగ్గురుకొమాళ్లు వుంన్నారుగదా వీరి పేర్లు వెంగటపతిరాయులు రామలక్ష్మ శ్రీరంగరాయులు వీరిలోవక్కరిని రాయవేలూరి శింహ్హాసనాన్కి యివ్వమని మనివిచేయగా పెద్దకొమారుడు అయినా వెంగటపతిరాయులును యిచ్చెను ఆయన వచ్చి ప్రశస్తంగా ప్రభుత్వం చాయక వివాహంచేసుకోక అపకీర్తిపాలై మూడియేండ్లు ప్రభుత్వంచేసి మృతుడాయను పునః కోనేటిరాయులును దత్తుఅడిగితే యివ్వకపోయిను అటుపింమ్మట కంపనూరిగోపాళరాజుగార్నిని అడిగితేను శ్రీరంగరాయులును యిచ్చెను వార్ని తీసుకువచ్చి వేలూరుశింహ్హాసనాన్కి అధికారంచేసిరి ఆయన బహుజారుడై ప్రభుత్వంవిచారణియ్యంలేనందున రాజ్యం అన్యాక్రాంతంజేశి బిదునూరుకు పోయినంత్తలో ఆగ్రామాచికమాజి గొపునుగావచ్చి పిలుచుకపోయి రెండు

లషులురాజ్యంయిచ్చెను కొన్నిదినములు అక్కడనేవుండి స్వర్గస్తుడాయెను ఆ యన సమంధం బిదనూరులోవుంన్న బిరుదులు భూషనాలు ఆయుధాలు కొంప లరాయుడుఅనేయేనుగ రామదాసుఅనే యేనుగను అనేగొందికి పంపిస్తేను యిక్కడ కోనమరాజుకొమాళ్లు రాయలయ్య తీసుకొనిరి రాయులుకు నిస్సంత్తతి అయినందున శ్రీరంగరాయులుగారికి పట్టాభిషిక్తుడై గగనమహాలు శీతా రామునిసదుపు చావడి పెద్దనగరు కటించుకొని నల్గురుబంధువులుతోను ఆ స్తలమందు వుండిరి శ్రీస్వామి అనుగ్రహముచ్లను నలభైలషులరాజ్యం సంపా దించుకొని వుంన్నంతలో శ్రీరంగరాయులువారికి ముసలిచంద్రాజుఅయ్యా పెద్ద వెంగణ్ణయ్యా యీవుభయ మిత్రులు యిరవైయేంఢ్లవారై వుండగా ముసలిచంద్రాజు అయ్యాకు పట్టాభిషేకంచేసి శ్రీరంగరాయులు స్వర్గస్తుడాయెను యింత్తలో రాజ వాపు ఆవాంత్తరంవాతను రాజ్యంవిడిశి క్షేత్రముల పోతురాయి ఆప్రాంత్యముల యిరవైసమత్సరాలు కాలక్షేపంచేసి అంతటవుండగా రామప్పయ్యగారు తిమ్మ ప్పయ్యగారు పోతురాయిఅనేగ్రామంలో జననమై యెనిమిదిసమత్సరాలు అయినపిమ్మట రాయులువారి ప్రాశీగెలు రాయవేలూరుసమంధంకొందరు - బుక్కరాజులు కమ్మవెలమలు - పాతిరికంపేసుగొండ నంమ్మథము - బంత్రాతులు - కనకగిరివేస్టకడిచినాయుడు - గుత్తికోటచిన్నజంపు నాయకుడు - వీరందరుకూడీ బుక్కసాగరం తానావేసుకొని అక్కడనుంచి - కృష్ణాలమీదికి ప్రవేశించ్చి వూళ్లో వుండే శహాజీవారీగాలు కానార్ని రాత్రిగ్గు - పట్టాంసొచ్చి బహుజనాంన్ని ముక్కుచవ్రులుగ సేవరునకు ప్రజలు హాల్లుపోయి - శహాజీవారితో - మొరలు పెట్టుకొనేవరకు శహిజదుగ్గాలసమీపాననాల్గువేలమందిని చౌకీలువుంచ్చి మిమ్ము రాయులవారినుంది కనిపించుకుంట్టె ముఖభంగంచాయుమని తాకీదుచేసివుం డగా పాతరికాలు వీరణ్ణఘుట్టుచేరి అతివుపద్రసంచేయగా ప్రతిదినం పాతరికాలు లోను పెమ్మసాని వెంగటపతినాయునికి ఆంజనేయస్వామిదుర్గానవుంన్న దేవుడు స్వప్నమందువొచ్చి దేవుడులేనిగుడి పూజచేస్తువుంన్నారు యిట సుగ్రీవుల బిరుదు(పట్టణ)వున్నది కాగా మీయేలినవారు పోతురాయఅనేగ్రామంలో వుం న్నారు వార్ని యిక్కడికి ఆగతంచేసి ముందర స్వామికార్యం చక్కపరిచేటం దుకు నాకు శ్రీరాముల అనుగ్రహమైనది అని వెంగటపతినాయునికి ఆంజనే యులు ఆజ్ఞాపించినపిమ్మట । పిన్నపెద్దలు నల్గురునాయకులున్ను స్వర్నగిరివుడిచి నాయునితో సహాగా ఆంజనేయులుకృపచేశి ప్రసాదించిన అభిప్రాయం వీరం దరికి యెక్కచేసి పెమ్మసానివెంకటపతినాయని తిమ్మప్ప రంగప్పనాయునికి

నక్కలదుష్టినాగన్నను చెంచురామునకు పుల్లయగాయలతిమ్మన్న వెలుగోటివోబన్న
యీఅయిదుగురున్ను యిరవైయిద్దరు బంట్రోతులున్ను ప్రయాణంచేశి నాల్గు
వేలరూపాయలు ఖర్చులకుయిచ్చి పోతురాయికి పంపగా వారుపోయి రాజాధి
రాజ శ్రీరామప్పయ్యతిమ్మప్పయ్యగారికి ఆగతవర్తమానంచెప్పి అంపగా రాజ
రాజశ్రీ రాయులవారు పిలువనంపగా వీరుపోయి సాష్టాంగవందనములుచేశి
యావద్వర్తమానం మనవిచేసుకొన్నగాను రాయులవారు తన ప్రధానిఅయిన గాద
గిరిఅప్పయ్యను పిలిచి మనస్తలాలునుంచి సుభవార్తలు తీసుకొని పాతరికాలు
వచ్చినారు యిందులకు యేమి ఆలోచనఅని రాయులవారు సెలవుయిచ్చిరి।
ప్రధాని గాధగిరిఅప్పయ్య దేవరా మీప్రభావమువల్లను శుభవార్త విన్నట్టు
ఆయను మార్గశమాసనకు శుభలగ్నం విచారించి శిద్ధపరచి ప్రయాణంఅయి
యీస్థళాన శానాదినములు వాసంచేశివున్నారము యానత్ పాళెగాండ్లకు
సాహెబ్సుబేదార్లకు తెలుసుకై యున్నది। కాగా మనము రాత్రి ప్రయాణంగా
పోవలశినది యీరాత్రి పెన్నవోబలం నరశింహస్వామివారి దరిశనంచేసుకొని
అందుంచి ఆమిదాలరాకట్టసగ్గిర మజిలిచేశి ఆమొర్నాడు చంద్రావలోకం
కాగానే తర్లివచ్చి స్నానసాగరంచేరి అచ్చటనుంచి బుక్కసాగరానకువచ్చి
కోటలోవున్న సిలేదార్లకు చెప్పిఅంపగా ఆశిలారిమువారినాయకుడు మొదలైన
బంట్రోతులును స్తోమంచేసుకొని యెదురుగావచ్చి ప్రాల్లోకి పిలుకపోయిరి। వీరిని
ఆస్తళానవుంచుమని రాయులవారిసెలవుతీసుకొ పాతరికంవారు పోయి వీరన్న
గట్టులోవుండే పాతరికం చిన్నవుశిబినాయుడు గుడెకోటజటంగినాయకుడు
వీరున్ను రాజరాజేశ్రీ రాయులవారికి సాష్టాంగవందనములుచేశి వినయవిధేయులై
మనవిచేశిరి। మీరు మనపట్నం స్వాధీనంఅయ్యేవరకు కనకగిరికి విజయం
చాయవలెనని మనవిచేశి పిలుచుకపోయి కనకగిరిలోను యేలినవారిని నిలిపి
తాము పాతరికాలువచ్చి మేగోటదుర్గముచేరి అక్కడ అందరుకూడి యోచన
చేశి రాయులవారికి విన్నపంచేశిరి। యేలినవారికి సాంమ్రాజ్యపదవి చేయుకూడి
సింహాసనరూఢులైనప్పుడు మాకు కొన్నిబిరుదులు దయచాయవలశినదని మనవి
చేస్తేను రాజాధిరాజేశ్రీ వేలినవారు సెలవుయిచ్చిరి మీరు స్వామికార్యా
ధురంధరులువున్నారు। యావత్తుకీర్తిప్రతాపఖ్యాతి నావాంకితంమాది సకల

సుఖానుభవం మీాదేవున్నది అని ముందరకార్యం ప్రేరేపణచాయవలశినది । ఆలస్యాదమృతంవిషం । అనేన్యాయంవున్నదిగనుక అలస్యంచాయవద్దండని నిరూపందయచేశిరిగనుక స్వామికార్యాసకు సెలవుయిచ్చినందున మహాప్రసాదమని ధురంధరత్వం వుపయోగించగా సాజీవారికి యీాపాతరికాలు అధికబాధలు చేస్తూవున్నారని మనివిచేయగా వారు కొత్తపౌజును జమచేసుక పట్నం బల్కాయించక వుండినంతలోను వెస్మసాని వెంకటపతినాయుడు వుడిచినాయుడు యీావుభయత్రులు మనకు ఆంజనేయుల ఆగ్నానుసారం యీాదినం జయప్రదం వున్నది । మనమీామట్టుకె సాయంకాలపర్యంతము నిలిచి రాత్రికాగానే కస్తుచేశి లగ్గలుయెక్కి చిరచ్ఛేదనాలు శాయవలనని ఆలోచనచాయగానూ॥

---

(దయచేసి, దీనిశేషమెవ్వరైనఁ బంపిన ముందుఁ బ్రకటింతుము.)

౧౦.

# ఐన్‌స్టయిన్ యొక్క సాపేక్షత్వవాదము.

EINSTEIN'S THEORY OF RELATIVITY.

(ఏలూరు పరిషత్సభలోఁ జదువఁబడినది.)

ఐన్‌స్టయిన్ అనునాతఁడు యైరోపాఖండవాసి, గొప్ప భౌతికశాస్త్రవేత్త. భౌతికవిషయములను సులభముగా సమన్వయించుకొనుట కాధారభూత మగు నొకసూత్రమును గల్పించినాఁడు. ఈసూత్రముచే సాధింపరాని భౌతికవిషయములే కానరా కున్నటు లున్నవి. ఇదివఱలో నేర్పాటుచేయఁబడిన భౌతికశాస్త్రసూత్రములకు లోఁబడనివిషయములు దీనివలన సమన్వయము లగుచున్నవి. ఈతనివాదమును గుఱించి చేతనైనకొలఁది మనవిచేసికొనుచున్నాను.

ఐన్‌స్టయిన్ మహాశయుఁడు జర్మనీదేశమునఁ బుట్టెను. బాల్యముననే స్విట్జరులాండునకుఁ బోయెను. అక్కడనే పెరిఁగి పెద్దవాఁ డాయెను. జ్యూరిచిలోను ప్రేగులోను భౌతికశాస్త్రోపాధ్యాయుఁడుగాఁ బనిచేసెను. ఐరోపామహాసంగ్రామము కొద్దిదినములలో జరుగఁబోవు ననఁగా బెర్లినువిద్వత్పరిషత్తుచే మహోపాధ్యాయునిగాఁ బిలువఁబడి పనిచేయుచు కైజరుప్రభువు పేరిట స్థాపింపఁబడిన భౌతికశాస్త్ర నూతనవిషయవిమర్శనాలయమునకు (The institute of Physical Research) అధికారి (Director) గాఁ గూడ నియమింపఁబడెను. ఈయన కిప్పుడు నలువదిమూఁడవయేఁడు. పదునెనిమిదవయేఁటనే యీవాదమును గుఱించి యాలోచన లారంభించి యిరువదియేడవయేఁట, అనఁగ ౧౯౦౫-వ సంవత్సరమున వాదమును గొంత వెల్లడిచేసెను. ఘోరసంగ్రామము వలదు వల దని కైజరుప్రభువునకు హితమును బోధించిన శాస్త్రజ్ఞులలో నీతఁ డొకప్రముఖుఁడు, యుద్ధకాలమున కైజరుప్రభు వీతని ననాదరముగ జూచెను గాని యాతఁడు తనవాదమును బలపఱుచుకొనుచుఁ గాలమును గడిపెను. యుద్ధానంతరమున నీమహనీయుని ప్రఖ్యాతి యారంభ మాయెను గాని "పెరటిచెట్టు మందునకు రా" దన్నటు లీతఁడు జర్మనీయం దంతగా నింగ్లాండు మొదలగు నితరదేశములయందు ఘనగౌరవమును గాంచెను. ఈత

డింగ్లాండునకుఁ గొలఁదిమాసములక్రిందటనే పిలువఁబడెను. మహాసభలయం దుపన్యాసముల నిచ్చెను. ఆంగ్లేయు లీతనియెడల నమితోత్సాహమును జూపిరి.

"ఇంతటిగణితశాస్త్రజ్ఞుఁడు నింతటివినయుఁడు నింతటిశాంతపురుషుఁడు నీకాలమునందు నుతికెక్కెఁడు లేఁడు. సర్వసాధారణముగ నేకాలమునను గాన రాఁడు." అనుచు నొకసభలో సభ్యులుగా నున్నలార్డుహాల్డేనుగారు ఘంటాపథముగాఁ జెప్పెను. ఐన్‌స్టయిన్ భౌతికశాస్త్రవేత్తయే గాక గానవిద్యావిశారదుఁడు గూడ నఁట. ఫిడేలును జగన్మోహనముగా వాయించుచు నానందమును బొందుచుండునఁట. ఇట్టిమహాపండితుఁడు మన దేశమును ద్రొక్కునట్టి భాగ్యము మనలకు భగవంతుఁడు ప్రసాదించుఁగాక!

ప్రపంచస్వభావ మెట్టిది? దానికిఁ గారణ మేమి? యను జిజ్ఞాస యనాది నుండియుఁ గలదు. ఈజిజ్ఞాస రానురాను బలపడి విపులమై యనేకమార్గములను బట్టినది. ఒక్కొకదారినిఁ బట్టి యొక్కొకశాస్త్ర మేర్పడినది. తక్కినశాస్త్రములతో మన కిప్పు డేమియును బని లేదు. ప్రకృతము ననుసరించెదము. ప్రపంచము ద్రవ్యమయ మనియును (ద్రవ్యము = matter) ప్రేరణము (force) వలన ద్రవ్యమునకుఁ జలనము (motion) కలుగుచుండు ననియు, నీచలనసహితమగుపదార్థము శక్తివంత మగుచుండు ననియును, (శక్తి = energy) మొదలగు విషయము లీపదార్థవిజ్ఞానశాస్త్రమునందుఁ (physics) జెప్పఁబడియుండును. ఈ శాస్త్రమునకు మూలశాఖ చలనవిద్య; (గతివిద్య) (dynamics). ఈవిద్యను వృద్ధిచేసినవారిలో ముఖ్యుఁడు న్యూటన్ అనునాతఁడు. ఈతనిసిద్ధాంతములే నేఁటికి నేయాక్షేపములును లేక వాడుకలో నున్నవి. ఈవిద్యాశాఖయందు మూలాధారసూత్రములు మూఁడు గలవు. (Newton's Three Laws of Motion). ఈసూత్రములకును మనవ్యవహారము లన్నింటికి నాధారములు దేశకాలములు (Space & Time). ఇవి యనసుభూతములు (a priori conceptions). ఇట్టివియని నిర్వచనముచేయుటకుఁ గాని మార్పుఁ జెందించుటకుఁ గాని శక్యముగాదు. హద్దులేని యనంత మగు దేశమం దీదృశ్యప్రపంచ మంతయు నిమిడి యున్న దని భావించుచున్నాము. ఆఁగుటకుఁ గాని ఆఁపుటకుఁ గాని వీలులేక నిరపేక్షముగాను స్వతంత్రముగాను గాలము పోవుచున్న దని భావించుచున్నాము. దేశకాలముల కన్యోన్యసంబంధ మేమియును లే దని మనము వ్యవహరించుకొనుచున్నాము. ఇట్టిమూలాధారము లగువిషయములను మినోవిన్స్కి ఐన్‌స్టయినులు తుంటకటిత్రేళ్లలోనికి బెటికి పాఱవేయుచున్నారు. దీనినిబట్టి

న్యూటనుయొక్క మూఁడుమూలాధారసూత్రములకును గొంచెడిపాటిసవరణ యవసర మనియు మొదలగు నభిప్రాయములను ఐన్సటయిన్ తనవాదరూపమున వెల్లడిచేసియున్నాఁడు. ఇట్టిసవరణ లెన్నఁడును జేయ నవసర ముండ దని దృఢనిశ్చయులై శాస్త్రజ్ఞు లుండుటచేత నీవాదమునకు మిక్కిలి ప్రచారము కలిగినది. ఐన్సటయిన్ యొక్క సిద్ధాంతమునకుఁ గల హేతుబీజములను సంగ్రహముగ వ్రాయుచున్నాను.

౧. గ్రహములు మున్నగుగోళము లన్నియును సావకాశ మగునాకాశమందు (empty space) నియతముగఁ దిరుగుచున్న వని న్యూటనుయొక్క మతము. పదునెనిమిదవశతాబ్దాంతమువఱకు నిదియే సిద్ధాంతముగ గ్రహింపఁ బడినది.

౨. పందొమ్మిదవ శతాబ్దారంభమునందు విద్యుచ్ఛక్తి (electricity) చుంబకశక్తి (magnetism) తేజశ్శక్తి (light) సంబంధములైన విషయముల గుఱించి పరిశోధనలు ప్రబలెను. ఈమూఁటికిని మూలస్వరూప మొక్కటియే యని తేలినది. ఈశక్తులు తరంగరూపమున వ్యాపించుచుండవలయు నని నిశ్చయింపఁబడినది. అట్టివ్యాపకమున కాధార మేది? దేనిమూలమున నీతరంగములకు వ్యాప్తి గలుగుచున్నది? ఈసందేహనివృత్తికొఱకు నప్పటిశాస్త్రజ్ఞులు ఈథరు (Ether) అనునాధారమును గల్పించుకొనిరి. పైని జెప్పినమూఁడుశక్తులకు సంబంధించిన నూతనవిషయములను సమన్వయించుకొనుటకుఁ గా నీ యీథరునకు సర్వవ్యాపకత్వము నచలత్వమును స్థితిస్థాపకత్వమును (elasticity) మొదలగుగుణము లుండితీరవలయు ననియును బాహ్యాకాశము (space) దీ యీథరు నిండియున్న దనియును నిశ్చయించుకొని వ్యవహరించుచు వచ్చిరి.

౩. ఈయంతరాకాశ మగు నీథరులో సూర్యునిచుట్టు ప్రదక్షిణమునందు భూమి సెకన్డునకు ౧౮౪ మైళ్లవంతునఁ దిరుగుచున్న దని గణితమువలన నేర్పడుచున్నది గదా, దీనిని బ్రయోగమువలన నేల కనిపెట్టరాదు, ప్రయత్నము చేసెద మని కొందఱు శాస్త్రజ్ఞులు పూనుకొనిరి. వారిలో మైకెల్సన్, మార్లే, మిల్లర్ అనువారు ముఖ్యులు. వీ రమెరికాఖండమువారు. ౧౮౮౭-వ సంవత్సరమునుండి ౧౯౦౫-వ సంవత్సరమువఱకును బ్రయోగములను మార్చిమార్చి వీరు చేయుచువచ్చిరి. కాని, యీథరులో భూమి కేవిధమైన చలనముఁగూడ లేదని యీప్రయోగములవలన స్పష్టపడుచువచ్చినది. ఏమీ యీవింత? భూమి తిరుగుటలేదా? లేక భూమితోఁగూడ నీథరు తిరుగుచున్నదా? ఈథరు అచ

లమై స్థిరముగ నుండవలయునని కదా యూహించితిమి. అట్లు కాదా యేమి? లేక యీథరు అనునదియే లేదా యేమి? అట్టిచోఁ బైనుదాహరించిన విద్యు దాదిశక్తులకు సంబంధించిన నూతనాంశములకు సమన్వయ మెట్లు? ఈ మొద లగుసందేహము లత్యంతము బాధింపఁజొచ్చినవి.

౪. లారెన్ట్జ్ (Lorentz) ఫిడ్జిరాల్డు (Fitz Gerald) అను శాస్త్రజ్ఞు లీసందేహములకు సమాధానమును గల్పించిరి. ఎట్లన:—"భూమితిరుగుచునే యున్నది. గణితములు తప్పుగావు ప్రయోగములను జరుపువా రుపయోగించు దేశకాలముల కొలతలయందుఁ గొంతమార్పు చేయవలసియున్నది దానికిఁ దగిన కారణములు గలవు. ఈ కారణములు తెలియక కొలతలను మార్పుచేసి కొనవలె నని తెలియకగక యుండుటచేతఁ బ్రయోగములవలన భూమియొక్క గతిని గనిపెట్టవచ్చు నని యూహించిరి గాని యట్టిమార్పులు చేసినచో భూచ లనము ప్రయోగములవలనఁ గనిపెట్టుట కవకాశము లేదు."

(Lorentz Fitz Gerald contraction.)

ఈవిషయమును గురించి యొకయుదాహరణము విపులముగా నీక్రింద వ్రాయుచున్నాను. ఇందు రెండంశములు మూలములు. అవి నిర్వివాదములు. శాస్త్రసిద్ధములు. అవి యేవనఁగా:—

౧. చలనము సాపేక్షము (All motion is relative.) రెండు రైలుబం డ్లొకచోఁ గలసిన వనుకొందము. మన మొకబండిలో నున్నపుడు మనబండి కద లినదో లేక రెండవది కదలినదో తెలియని యవస్థ తటస్థించును. రెండవప్రక్క నున్న నేలనుగాని రైలుస్టేషనునుగాని చూచుకున్నచో నేబండి కదలినదియుఁ దెలిసికొనఁజాలము. రెండవబండిలోని వారివిషయము నిట్టిదే. మన మొక పడవలోఁ గూర్చుండి పోవునపుడు దానివ లోపలిభాగమును జూచుచుఁ బడవ నడచుచున్నది లేనిది కనిపెట్టలేముగదా. పడవకు నితరమగుదాని నపేక్షించి నఁగాని చలనము గోచరింపదు.

౨. సెకన్డునకు ౧,౮౬,౦౦౦ మైళ్లవంతున తేజస్సు వ్యాపించుచున్నది. ఇది ప్రయోగములవలన గ్రహింపఁబడిన సారాంశము. వెలుఁగునకుఁ గారణ మగువస్తువునకుఁ గాని వెలుఁగును గ్రహించు మనకుఁగాని యెట్టిచలనము గలిగియున్నను సెకన్డునకు ౧,౮౬,౦౦౦ మైళ్లవంతుననే తేజస్సు వ్యాపిం చుచుండును గాని మార్పుఁజెందదని ప్రయోగములమూలమున స్థాపింపఁ బడినది.

## ఉదాహరణము.

ఒక స్టేషనునుండి తూర్పుగా నొకటియును, పడమరగా నొకటియును, రైలుబండ్లు పోవుచున్న వనుకొందము. క యనువాఁడు మొదటిబండిలోను, గ, యనువాఁడు రెండవదానిలోను బోవుచున్నా రని భావింతము. వారియొద్దఁ గొలబద్దలు, గడియారములు నున్న వందము. పైనుదాహరించిన ౧, ౨ అంశ ములనుబట్టి గణితము చేసినచో, క, గ యనువారిరువురు నీక్రిందియభిప్రా యములు నన్యోన్యముగు బొందుచుందు రని, తెలిసికొనవచ్చును.

1. వారిబండిలోని వస్తువుల తూర్పుపడమరల కొలతలు వీరికిని, వీరివి వారికిని, పొట్టిగాఁ గనఁబడును. ఉత్తరదక్షిణములకొలతలయందు భేదము గోచ రింపదు, మధ్యదిక్కులయందుఁ గొంచెపాటిభేద ముండును.

2. ఒకరిగడియారముకంటె రెండవవారిగడియారము నెమ్మదిగాఁబోవు చున్నటులు పరస్పరమును దోఁచును.

3. ఏకకాలమున జరుగుచున్నటు లొకరికిగోచరించు దృశ్యములు భిన్న కాలములయందు జరుగుచున్నటులు రెండవవారికి గోచరించును.

4. వీరున్నబండ్లగతి హెచ్చినకొలఁది నీభేదము హెచ్చుచుండును. ఈ గతి సెకన్డునకు 161000 మైళ్లైనచోఁ దూర్పుపడమరలకు వ్యాపించిన గజము బద్ద, యరగజమువలె నొండొరులకుఁ గనఁబడును. దానినే దక్షిణోత్తరములకుఁ ద్రిప్పినచో గజమువలెనే తోఁచును. ఒకరు గడియయని తలఁచుకాలము రెండవవారి కరగడియవలెఁ దోఁచును.

ఒండొరులగతి 161000 మైళ్లనుండి క్రమముగ సెకన్డునకు 186000 మై ళ్లకు హెచ్చినచోఁ దూర్పుపడమరలకొలతలు క్రమముగా హ్రస్వమై, శూన్య మైనటు లొండొరులకుఁ దోఁచును. అనఁగా క, యనువాఁడు ఘనపరిమాణము గల దానిగా నెంచువస్తువునందుఁ, దూర్పుపడమరలపరిమాణము శూన్యమై నటులు గ కుఁ గనఁబడుటచేత, గ యనునాతఁ డావస్తువునే రెండుపరిమాణ ములు గలచదర మని భావించుకొనును. ఒకవస్తువే క కు, ఘనముగను, గ కు, చదరముగను గనిపించును. ఎవరియింద్రియములకెట్లు గోచరించునో యది వారికి నిజ మనియే నమ్మకము గాన, పైరెండభిప్రాయములును నిజమే. కా దనుటకుఁ గారణము లేదు. ఈనిజ మనునది వారివారి యవస్థ నపేక్షించుచున్నది. ఎవ రిది వారికి నిజము. ఒకరిది రెండవవారి కబద్ధము. వ్యవహారమందు మనకొం డొరులకు లభించు చలనముయొక్కగతులు మిక్కిలి స్వల్పములై యున్నవి.

కాన పైనుదాహరించిన యభిప్రాయభేదములు మిక్కిలి స్వల్పాంతరములుగ నున్నవి. అందుచేత సాధారణముగఁ గనిపెట్టుటకు వీలులేదు. అందుచేత వ్యవహారమునందు భేదము లేకుండఁ బోవుచుండుటకు వీలై యున్నది. వ్యవహారమున కెట్టిభంగమును గలిగింపని స్వల్పభేదములతో మన కేమి పని యని యందురా? అట్లు గాదు. కొద్దియో గొప్పయో భేద మున్నదా? ఉండు నని చెప్పు శాస్త్రము నిజమా? అనువిషయము ముఖ్యము గాని వ్యవహారమందలి బాధలతో మన కిచటఁ బనిలేదు.

౫. పైయుదాహరణమున వ్యక్తమగువిషయము లన్నియును జలనవిద్యను సంబంధించిన విషయములు. ఇవి చలనవిద్యయందు మాత్రము నిజమై తక్కినభౌతికశాస్త్ర భాగములయం దేల వర్తింపవు. పదార్థవిజ్ఞానశాస్త్రమునకు సంబంధించిన సర్వవిషయములకును, సర్వసూత్రములకును వీని నాశ్రయించి 1, 2 అంశము లేల యాధారములు గావు. అని ఐన్‌స్టయిన్ తర్కించుకొని, సాపేక్షత్వవాదము నొకదానిని గల్పించుకొని, యావాదమునకు బీజముగ నొకమూలసూత్రమును 1905-వ సంవత్సరమునఁ బ్రపంచమునకు వెల్లడిచేసెను. అది యెట్లన:—

RESTRICTED PRINCIPLE OF RELATIVITY.

All natural phenomena are in different to absolute translation; it is impossible by any conceivable experiment to detect *uniform motion* through ether.

సాపేక్షతావిశేషసూత్రములు.

దృశ్యములు చలనము నపేక్షింపవు (అనఁగాఁ గనఁబడుదానికిఁ గాని కనిపించు దానికిఁ గాని యెట్టిచలనము గలిగినను గనిపించుదానిలో, (దృశ్యములో) నెట్టిమార్పును గలుగదు. ఏవిధమైనయంత్ర, తంత్రములచేతను, యీథరునందలి సమగతిని గనిపెట్టుట యసాధ్యము.

ఈసూత్రము మూలమున నీక్రిందివిషయములు సిద్ధాంతము లగుచున్న వని ఐన్‌స్టయిన్ ప్రకటించియున్నాఁడు.

1. దేశ, కాలము లనంతములు గావు, నిరపేక్షములు గావు రెండింటికి నన్యోన్యసంబంధము గలదు. కాలనిర్ణయముఁ జేయనిదే దేశనిర్ణయమును దేశనిర్ణయముఁ జేయనిదే కాలనిర్ణయమును జేయుటకు వీలులేదు, అనఁగాఁ జోటు తెలియవలయు ననినఁ గాలము తెలియవలెను; గాలము తెలియవలయు ననినఁ జోటు తెలియవలెను. దేశకాలముల సమ్మేళనముచేతనే దృశ్యము సంభవించుచున్నది, వానిసమ్మేళనమే దృశ్యము. దేశమునకుఁ బొడుగు, వెడల్పు, ఎత్తు

నను పరిమాణములు మూఁడు గలవు. దేశకాలములకూడిక యగునీదృశ్య మగుప్రపంచమునకుఁ బొడుగు, వెడల్పు, ఎత్తు, కాలము ననుపరిమాణములు నాలుగు. రైలునచ్చుట, సభజరుగుట, చచ్చుట, పుట్టుట, మొదలగుదృశ్యము లన్నియు నిట్టిస్వభావము గలిగినవే. ఈనాలుగు, పరిమాణములు గలిగిన యఖండప్రపంచమందు (world continuum) భూతభవిష్యద్వర్తమానము లెన్నఁడో యేర్పాటుచేయఁబడి యున్న సార్వకాలికసత్యములు గాని వేఱు కావు. భూత మనునది వర్తమానమందు నిజముగ లేనిదిగాదు. మనకుఁ దటస్థ ముగాని పై యున్నది గాని వేఱుగాదు. భవిష్యత్తుకూడ నిజముగ నున్నవిష యమే కాని యింకను మనకుఁ దటస్థము గాకుండుటచే లేదని భ్రమపొందు చున్నాము. వర్తమానమందు భూతమును, భవిష్యత్తును గూడ గ్రహించిన గ్రహింపవచ్చును. ఇది సమస్థితావిశేషము గాని వేఱు గాదు. అట్టిసమస్థితి సామాన్య లగుమనకు లేదు.

2. విద్యుదాదిశక్తులకు సంబంధించిన నూతనవిషయముల సమన్వయము కొఱకై యీథరును గల్పించుకొనుట యనవసరము. ఈథరు ప్రసంగ మవసర ము లేకయే తనసూత్రమునుబట్టి యీనూతనవిషయము లన్నియును మిక్కిలి సులభముగా సమన్వయము లగుచున్నవని ఐన్‌స్టయిన్ ప్రకటించియున్నాఁడు. ఈథరుయొక్క కల్పనవలనఁ గలుగులాభము గానరాకున్నది. బహుశ్రమపడి కల్పించిన యీథరును శాస్త్రజ్ఞులు వదలిపెట్టవలసిన యవస్థ తటస్థమైనటులు గాన్పించుచున్నది. స్థూల మగుద్రవ్యమునకును (matter) శక్తికిని (energy) పర స్పరసంబంధము గలదని యును, స్థూలపదార్థముయొక్క స్వల్పభాగమును శక్తి రూపముగను, ఆశక్తిని దిరిగి స్థూలముగను మార్పవచ్చునని యును, మొదలగు విచిత్రములగు విషయములు నవీనముగఁ గనిపెట్టఁబడినవి. ఈవిషయము లీథరునాధారముగఁ జేసికొనిన వాదమునుబట్టి గ్రహింపఁబడినవి. అట్టిసర్వ విషయములను గూడ, యీథరు ప్రసంగ మెక్కడను లేకుండఁగనే ఐన్‌స్టయిన్ తనవాదమున సమన్వయించి చూపుచున్నాఁడు. ఈతనిమార్గము మిక్కిలి సుల భమై, సమంజసమై యొప్పుచున్నది.

## ఆకర్షణ: సాపేక్షత్వసామాన్యసూత్రము.

## GRAVITATION AND THE GENERAL PRINCIPLE ON RELATIVITY.

చేతనున్న వస్తువును విడిచినచో నేలఁబడును. పండుపండి చెట్టునుండి నేలరాలుచున్నది, భూమిని వదలి పైకి మనము పోఁజాలకున్నాము. వీనికిఁ

కారణము భూమ్యాకర్షణ మని చెప్పుచున్నాము. ఇటులే సామాన్యముగ ద్రవ్యమును ద్రవ్య మాకర్షించుచుండు నని న్యూటను మొట్టమొదట వ్యక్తము చేసియున్నాఁడు. ఈవిషయము ప్రయోగసాధ్యము. ఈయాకర్షణయొక్క స్వభావము, తత్త్వము తెలియదు. దీనిగుఱించి యుక్తియుక్తమగుసిద్ధాంత మింత వఱకు లేదు. విద్యుచ్ఛాదిశక్తులకు సంబంధించిన సర్వవ్యాప్తాకాశ (ether) వాదము వలన నీయాకర్షణశక్తికి సమాధాన మేర్పడకున్నది. దీనికి సమాధాన మరయుచు శాస్త్రజ్ఞులు పలుత్రోవలను త్రొక్కుచుండిరి. కాని తృప్తికర మగుమార్గ మింకను దొరకలేదు. ఇటు లుండఁగా ఐన్‌స్టయిన్ దీనికిఁ దగినసమాధాన మును సాధింపవలె నని ప్రయత్నించి, తనవిశేషసూత్రమువలన నీవిషయము లొంగుబాటులోనికి రాదని గ్రహించి దానిని పెంచి, సామాన్యసూత్రము నొక దానిని కల్పించినాఁడు. దానినిబట్టి యీయాకర్షణశక్తిని బహుయుక్తియుక్తముగ సమన్వయించి తనబుద్ధివైదగ్ధ్యమును ప్రపంచమునకు వెల్లడిచేసినాఁడు. సామాన్యులగు శాస్త్రజ్ఞుల కీతనిసమన్వయపద్ధతి తెలిసికొన వీలులేదు. మిక్కిలి కష్టసాధ్య మగుగణితశాస్త్రప్రవేశము గలిగినఁగాని యాతని మార్గము బోధపడదు. అతని మార్గమును దెలిసినవారిసంఖ్య మిక్కిలికొద్ది. ఇరువదికిలోపట. సాపేక్షతావిశేషసూత్రమందు సమగతినిగుఱించి చెప్పఁబడియున్నది. అనఁగా, వస్తువునకు సంభవించిన వేగములో హెచ్చుతగ్గులు లేక యెల్లపుడును సమముగా నున్నవిషయములకు మాత్ర మాసూత్రము సమన్వయమగును గాని తదితరములకుఁ గాదు. భూమ్యాకర్షణమునఁ జెందినవస్తువులు క్రిందికిఁ బడునపుడు వానికిఁ గలవేగము (velocity) సమముగాదు. వేగము క్షణక్షణమునకును వృద్ధియగుచుండును, గనుక విశేషసూత్రము వలన నీగమనము సాధ్యము గాదు. విశేషసూత్రమున సమగతి యనుటకు బదులు వేగవృద్ధి (accelerated motion) యనిమార్చిన సామాన్యసూత్రము కాఁగలదు.

సామాన్యసూత్రమునకు నాకర్షణకును సంబంధించిన కొన్నిసంగతులను సంగ్రహించుచున్నాను.

1. ఒక పెద్దరాతిని ఒకచిన్నగున్నును, ఎత్తగు నొకస్థానమునుండి క్రిందికేకకాలమున వదలినచో రెండును నేకకాలముననే నేలఁబడును. పడుచున్నపుడు ప్రతిక్షణమందును రెండింటికిని వేగములో వృద్ధిసమముగనే యగుచుండును, రెండును సమానముగనే పడుచుండును. పడునట్టి వస్తువుయొక్క యవస్థ యెట్టిదైనను పడుటలో మార్పులేదు. చేతిలో నొకరాతిని బట్టుకొని రాయి

బరువుగా నున్నదని యనుకొనుచున్నాము. ఏల యనఁగాఁ గ్రిందఁబడనున్న రాతికిఁ జేయి యడ్డమువచ్చుటయే కారణము. మిక్కిలి యెత్తైన ప్రదేశమునుండి చేత రాయినుంచుకొని మనము క్రిందికిఁ బడుచుంటి మనుకొనుఁడు, అట్టిస్థితిలో రాయియు మనమును సమానవేగముగ నేలఁ బడుచుందుము. రాతికిఁ జేయి యడ్డము రాదు. రాతిబరువు చేతి కుండదు. రాయి చేతి నంటియు నంట కుండును. అట్టిస్థితిలో నే మనమెల్లప్పుడు నున్నచో రాతికి బరువు లే దనియే భావింపఁగలము

అట్టిస్థితిలో రాతిక్రిందినుండి చేయిని దీసివేసితి మనుకొనుఁడు. అనఁగా రాతిని వదలితి మనుకొనుఁడు. రాయి మనలను వదలిపోవునా, పోదు. మన తోటిపాటంతరాళమున సమముగాఁ గ్రిందికి వచ్చుచునే యుండును. అప్పుడు రాయి పడుచున్నదని మనకుఁ దోఁపదు. మనమును బడుటచేత రాతికిఁ బడుట లే దని భావించెదము. కనుక బరువులేకుండుట, పడకుండుట యను భావము మనము రాతితోఁ గూడఁ బడు నవస్థయం దుండక రాయిమాత్రము పడునవస్థయందు, ననఁగా మనకందఱకును సామాన్యముగా నుండునవస్థలో నుండును. మనయవస్థను బట్టి రాతికి బరువు, పడుట, యనునవి యుండుట లేకుండుట కూడఁ దటస్థమగుచున్నవి. అందుచేత బరువు, పడుట, యనునవి సాపేక్షకములుగాని నిరపేక్షకములు గావు.

౨. శక్తిని ద్రవ్యముగను ద్రవ్యమును శక్తిగాను మార్పవచ్చుననియు, శక్తి ద్రవ్యములకు రూపభేదమే గాని వస్తుభేదము లేదనియును నవీనసిద్ధాంత మని పైని జెప్పియున్నాను. ద్రవ్యమునకు జడత్వము (Inertia) గుణము; ఆకర్షణ స్వభావము. ఆకర్షణవలన బరువును బడుటయును గలుగుచుండును. ఈగుణములు ద్రవ్యమునకే గాక శక్తికిఁగూడ నేలయుండవు, ఉండితీరవలయును. అట్లయినచో శక్తి పుంజము లగు తేజఃకిరణములకు బరు వుండవలెను. ద్రవ్యమయము లగు మండలములచేఁ దేజఃకిరణము లాకర్షింపఁబడుచు నామండలములవైపునకుఁ బడుచుండవలయు నని గ్రహింపవలసి యున్నది. కాని మన మేమనుకొనుచున్నాము. నక్షత్రములనుండి కిరణములు బయలుదేఱి మార్గభేదమును జెందక సూటిగా మనయొద్దకు వచ్చి చేరుచున్న వని గదా. ఇట్టి యభిప్రాయముచేతనే గదా నక్షత్రముయొక్క స్థలనిర్దేశమును జేయుచున్నాము. నక్షత్రమునుండి బయలుదేఱి వచ్చుకిరణమార్గము సూర్యమండలసామీప్యమైనచో సూర్యునిచే నాకర్షింపఁబడవలసినదిగా నీవాదమువలనఁ దేలుచున్నది. అదియే నిజ మగు

చోఁ గిరణమార్గమునందు భేదము గలుగవలెను. మార్గమునకు వంపు కలుగవలెను. ఆకారణమున నక్షత్రముయొక్క స్థలనిర్దేశమందు మాఱ్పుగలుగును. పటమును జూడుఁడు.




న = నక్షత్రమున్నచోటు.
సూ = సూర్యమండలము.
ప = పరిశోధకుఁడు.
వ = నక్షత్రకిరణమార్గమున వంపు కలిగినచోటు.
చ. న = చలించిన నక్షత్రస్థానము.
అ = వంపుచేత గలిగిన మార్గభేదము.

నక్షత్రకిరణమార్గము సూర్యమండలమునకు మిక్కిలి దగ్గఱయగునప్పుడు "న" యను నక్షత్రస్థానము మాఱి "చ. న" యనుదానియొద్ద నున్నట్టు గన్పట్టును. సూర్యమండలము నక్షత్రములయందుఁ జలించుచుండును గదా. అందుచేతఁ గొలఁదిదినము లూరకున్నచో "న. న" యనుమార్గము సూర్యునకు దూరమగును. అప్పుడామార్గమందు మార్పుగలుగదు. అందుచేత నక్షత్రస్థానమునకుఁ జలనము లేక "న" యొద్దనేయుండును. ఈవిషయము శోధించి కనిపెట్టఁదగినది. ఇది నిజమే యైనచో వాదము ప్రబలమగుట తటస్థ మగును గదా యను నిశ్చయముతోఁ దగినప్రయత్నములు పరిశోధకులుజరిపిరి. సూర్యమండలసామీప్యమున నున్ననక్షత్రమును శోధించుటకెట్లు వీలగును. రాత్రిగాని నక్షత్రములు గాన్పింపవు. అట్టినక్షత్రములు సూర్యునికిఁ జాలదూరమున నుండును. కనుక సూర్యునికి దగ్గఱగనుండు నక్షత్రములను బగటియందే చూచితీరవలయును. సూర్యరశ్మి యున్నంతవఱకు నది యసాధ్యము. సూర్యతేజస్సులో నక్షత్రమును జూడవీలు లేదు గనుక సంపూర్ణసూర్యగ్రహణకాలము మంచితరుణము. అట్టిసమయములు సంవత్సరమున కొకసారి కొన్నివిఘటికల కాల మెక్కడెక్కడనో దుర్గమమగు దేశములయందును దీవులయందును సంభవించుచుండును. అందుచేతఁ గొన్నిమాసములకు ముందటనే గ్రహణము పట్టు

సనంగా యంత్రములను దీసికొని వెళ్లి యాయాచోటుల స్థాపించుకొని తగిన యేర్పాటులను జేసికొనవలసియుండును. ఇట్టి పరిశోధకస్థానములు రెండుమూఁ డేర్పాటు చేయఁబడును. గ్రహణసమయమున ఛాయాపటములను దీసి నక్షత్ర స్థానమును నిరూపింతురు. ఇటువలెనే సూర్యుఁడు దూరమునకుఁ బోయిన తరువాత నక్షత్రస్థానమును రాత్రియందు ఛాయాపటములమూలమునఁ దిరిగి నిరూపింతురు. ఈ రెండుస్థానములకును గలయంతరమును (అ) గ్రహింతురు. ౧౯౧౯ సంవత్సరమం దిట్టిపరిశోధనలు రెండు ప్రదేశములయందు జరుపఁబడినవి. రెండింటిపర్యవసానములును గొంచెఁ దేడాతో నొకటియే. ఐన్సుటయిన్ తన సామాన్యసూత్రమును బట్టి గణితమును వేసి మార్గభేద మింత యుండవలె నని లెక్కించినదానికిని బరిశోధకులు కనిపెట్టినదానికిని స్వల్పాంతరమే గాని విశేషించి భేదా లేదు. ఆతనిగణిత మిట్లు దృక్సిద్ధము కాఁగానే శాస్త్రజ్ఞు లాశ్చర్యపడిరి. ఇట్టిమార్గభేదమును సమర్థించు శాస్త్రము నిదివఱలో నెవ్వరు నెఱుఁగరు. ఐన్సుటయిన్ తనవాదమును సిద్ధాంతపఱిచినాఁడు. అది దృక్సిద్ధమైనది. కనుక నాతని వాదము నిజ మని శాస్త్రజ్ఞు లొప్పుకొనవలసివచ్చినది. నాఁటినుండి యును వాదమునకుఁ బ్రచారము ప్రారంభమైనది.

౧౯౨౨ సం॥ సెప్టెంబరు ౨౧-వ తేదీని సంపూర్ణసూర్యగ్రహణము పట్టనై యున్నది. పైవిషయమును దిరిగి పరిశోధించుటకై ప్రయత్నములు జరుగుచున్నవి. మనదేశమందలి కొడైకెనాలులోని నక్షత్రశోధనశాలాధికారియగు యెవరుషెడ్డుగారు కూడ నాఁబోవుపరిశోధనలలోఁ బాల్గొనఁబోవుచున్నారు.

3. మఱియొక దృష్టాంతము నిచ్చి వివరించుచున్నాను. న్యూటనుగా రేర్పఱిచిన గ్రవ్యాకర్షణసూత్రమును (Law of Gravitation) బట్టియుఁ జలన విద్యయొక్క మూఁడుమూలసూత్రములను బట్టియు గ్రహాదులయొక్క గతులను గట్టుచుఁ బాశ్చాత్యసిద్ధాంతులు పంచాంగములను వ్రాయుచున్నారు.

ఆగణితసిద్ధము లగు గ్రహములు దృక్సిద్ధములగుటలోఁ గొన్ని భేదములు గానవచ్చినవి. బుధగ్రహముయొక్క రవినీచయందు (Perihelion) మిక్కిలి భేదము గానఁబడుచున్నది. ఈ భేదమునకుఁ గారణము తెలియక సిద్ధాంతులు కలవరపడుచున్నారు. ఇట్టిస్థితిలో ఐన్సుటయిన్ తనసామాన్యసూత్రమునుబట్టి గణితమును జేసి బుధగ్రహముయొక్క రవినీచను గట్టి ప్రాఁతగణితమువలన సిద్ధించుదానికిని దనగణితసిద్ధమునకును దారతమ్యము గల దనియును, దనగణితముచేత లభించిన గ్రహము దృక్సిద్ధమగు ననియును జూపెను. వాదమున కిది

యొకబలము. కాని బుధగ్రహముగాక తక్కిన కుజుఁడు, గురుఁడు, మొదలగు గ్రహములయొక్క భేదములు ఐన్స్టయిన్ గణితముచే సమర్థించుటకు వీలులే దనియును బుధగ్రహమును దక్కిన గ్రహములును దానుసూచించు వేఱుకారణముచేతఁ గల్పింపఁబడిన గణితపద్ధతిని దృక్సిద్ధము లగుచున్నవనియును అమెరికా వాస్తవ్యులును గొప్పసిద్ధాంతులు నగు స్ప్వారుదారగా రీమధ్య నొకవ్యాసమును బ్రచురించియున్నారు. ఇందుచేత ఐన్స్టయిన్ యొక్కవాదమునకు బలము తగ్గిన దని మాత్ర మెంచుటకు వీలులేదు. కాని శాస్త్రజ్ఞులు క్రొత్త దారులను ద్రొక్కి ప్రాఁతపద్ధతులచేతనే నూతనాంశములను సమర్థింపఁబూనుచుఁ గొన్నింటియందు ఫలమును బొందుచున్నారు కలిగినని తెలిసికొనవలసి యున్నది.

## వాదముయొక్క ప్రస్తుతస్థితి.

ఐన్స్టయిన్ యొక్క వాదము నిలుచునది లేనిది నిశ్చయింపవలె ననిన, నాతనిగణితముచేతఁ గ్రొత్తవిషయములను గనిపెట్టి పర్యవసానములు దృక్సిద్ధము లగునో కావో పరిశోధనలవలన గ్రహించి దృక్సిద్ధములైనచో వాదము నంగీకరించుచుఁ గానిచో నిరాకరించుచు రావలెను. ఇట్టిశోధనలలో గొప్ప గొప్ప భౌతికశాస్త్రజ్ఞులు మునిఁగి తేలుచున్నారు. వానిపర్యవసానము లింతలోఁ జేఁవు తేలినతరువాతఁ గాని యిదమిత్థ మని నిరూపింప వీలులేదు.

## ఈవాదము ప్రకృతిశాస్త్రసిద్ధమా? వేదాంతమా?

శాస్త్రజ్ఞానము నిజమా? మనయొక్క యవస్థను బట్టి శాస్త్రము నందు నిర్వచనము చేయఁబడిన భావములు మాఱుచుండునా? నిజ మని మనము నమ్ముదానిలో నిశ్చయమెంత? జ్ఞానము మనోవికారమా? మనస్సునకును మనోభావములకును నితరమై నిత్యమును గేవలము నైనప్రపంచ మొకటి గలదా? దానిస్వభావ మెట్టిది? ఎట్లు తెలిఁగనగును? అను నీసందేహములు ఐన్స్టయిన్ యొక్క వాదమునఁ బుట్టుచున్నవి. మఱియు శక్తికిని ద్రవ్యమునకును భేదములేదు. ద్రవ్య మనునది ఘనీభవించిన శక్తిస్వరూపము గాని వేఱు గాదు. మార్గము నెఱిఁగినచో ద్రవ్యమునుండి యనంత మగుశక్తిని గ్రహించి యుపయోగించుకొనవచ్చును. అను భౌతికశాస్త్రసంబంధ మైనట్టియు వినుట కాశ్చర్యములగునట్టియు మెట్టవేదాంతము లనియును శాస్త్రజ్ఞుల మతిభ్రమణము లనియును నెఱుఁగనివారు భ్రమించునట్టియు సారాంశము లీవాదమునఁ బుట్టుచున్నవి. కాని యివి వట్టియూహలు గావు. ప్రయోగసిద్ధమగు

భౌతికశాస్త్రసమ్మతములు గాని వేదాంతములు గావని ఐన్స్టయిన్ చెప్పుచున్నాఁడు. ఈవిషయములను గాని యిట్టి విషయములను గాని వేదాంతమార్గముననో మఱియేమార్గముననో కూడ నూహించి గ్రహించుటకు వీలుండిన నుండవచ్చును, గాని, పైవిషయములు మాత్రము కేవలము వేదాంతవాక్యము లనుటకు వీలులేదు.

ఐన్స్టయిన్ యొక్క నూతనవాదమువలనఁ బదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞులలో రెండుతెగ లేర్పడినవి. ప్రాచీనపద్ధతిని అనఁగా సూక్ష్మాకాశవాదము నవలంబించునట్టి సర్ ఆలివర్ లాడ్జి మొదలగువా రొకతెగ. సాపేక్షత్వవాదము నవలంబించిన ఐన్స్టయిన్, ఎడ్డిన్గ్టన్, కన్నింగుహామ్ ప్రభృతులు రెండవతెగ. ప్రకృతిశాస్త్రమునందే గాక యితరశాస్త్రములయందుఁగూడ నీసాపేక్షత్వవాదము సమన్వయ మగుచున్న దని లార్డుహాల్డేనుగా రభిప్రాయపడుచు నొక గ్రంథమును బ్రచురించియున్నారు. తత్త్వశాస్త్రమందును (philosophy) రాజనీతిశాస్త్రమందును బ్రతిమనుజుని దినచర్యయందును సాపేక్షత్వ మెట్లిమిడి యున్నదో దానివలన నెట్టియద్భుతమైన సంగతులను గ్రహింపనగునో యాగ్రంథమున సూచించియున్నారు. బాహ్యప్రపంచమునకును మనస్సునకును గలసమ్మేళనమువలనను నన్యోన్యసాపేక్షత్వముచేతను విజ్ఞానము గలుగుచున్న దని హాల్డేనుప్రభువు ముఖ్యాభిప్రాయము. దానినిబట్టి యీసాపేక్షత్వమే సర్వవిజ్ఞానమునకును మూలాధార మని తోఁచుచున్నది.

విస్సా అప్పారావు.

# ప్రార్థనము.

పరిషత్సభ్యవరులార! పరిషత్పత్త్రికాపాఠకులార!

మి మ్మనేకపర్యాయములు చందాలను దయచేసి పంపుఁడని కోరియున్నాము. రెండు, మూఁడు, సంవత్సరములనుండి సొమ్ము పంపియుండలేదు. మాటిమాటికి వ్రాయుటకు పోస్టుకార్డు వెల హెచ్చినది. వి. పి. కట్టుటకు హెచ్చుధర పెట్టినారు. కాగితముల వెల పెరిఁగియున్నది. వ్యవహారవిదు లగు మీరాయట్టివారు మాపత్త్రికావిషయమున నుపేక్షఁబూనుట ధర్మము కాదు.

ఈపత్త్రికాముఖమున మేముచేయు ప్రార్థనమును దయతోఁ జదివి వెంటనె యొక్కొక్కసంవత్సరము చందానైనను దయచేయుదు రని యెదురు చూచుచున్నారము. అశ్రద్ధచేయకుఁడు.

కార్యదర్శులు,
ఆం. సా. పరిషత్తు,
చెన్నపురము.

శ్రీరస్తు.

# కాకతీయులు క్షత్రియేతరులా, క్షత్రియులా?

కాకత్యాకటిరాజకీర్తి లొసరుం గైలాసమై యేరికి
ద్దేశంబే తగు మూఁడులింగముల వర్ధిల్లుం త్రిలింగాఖ్యమై
యాంశాస్యంబులు మాకొసంగుదురు నానారామకాళేశ్వర
శ్రీశైలస్థితు లమ్మహేశ్వరు లవిచ్ఛిన్నప్రసాదంబునన్॥

అనన్యరాజన్యసామాన్యనీతివిన్యాసనైపుణ్యంబువలనను, అనక్రదోర్విక్ర మప్రక్రమోపక్రమ క్రియానైపుణ్యంబువలనను, అఖండాంధ్రోర్వీమండలంబు నేకచ్ఛత్రాధిపత్యంబు క్రిందికిఁ దీసికొనివచ్చి నానాద్వీపాంతరాగతప్రగల్భనాగ రకజనజేగీయమాన నిర్వ్యాజప్రజారంజనాభిముఖ్యంబుగను సకలకలాకౌశల్య కల్యానుకూల్యంబుగను త్రిలింగసామ్రాజ్యంబుఁ బరిపాలించి చిరస్మరణీయులైన కాకతీయమహారాజు లాంధ్రలోకంబునకుం బ్రాతఃస్మరణీయులు. అట్టి కాకతీయ వంశమౌక్తికమణుల జాతీయచరిత్రం బపూర్వవిమర్శకమహాశయతులాధిరోహ ణంబునొంది హేత్వాభాసగుంజాసమతోలనంబునకును వర్ణాపకర్షణతాలాఘవం బునకును భాజనంబు చేయంబడుచుండుట మిక్కిలి శోచనీయము. పాశ్చాత్య ప్రగల్భనాగరకతాబంధురం బయినయీ ౨౦-వ శతాబ్దమునందలి యిట్టియపూ ర్వపరిశోధనవిశేషంబు లసంఖ్యాకంబుగ మనయాంధ్రభాషాప్రపంచంబు నల్లు కొని తల్లడపెట్టుచున్నవి. ఇట్టిదోషములు సాహిత్యపరిషత్తువారి పరిశోధన వలనఁ జక్కనయ్యెడు నని యాంధ్రలోకము విశ్వసించియున్నది. వారును నించుమించుగ నిప్పట్టున నట్టిమార్గము నే యనుసరించుట మిక్కిలి విషాదకరము. అట్టివిషాదమే నన్నుం జోదనచేసి కాకతీయులు క్షత్రియేతరులా క్షత్రియులా యనునీచిన్నవ్యాసరచనకుం గడంగునట్లు చేసెను ఇప్పుడు నేను మూలమూలల నుండి యింతకుము న్నెవ్వరు నెఱుంగని వింతవింతశాసనములు సంగ్రహించి క్రొత్తక్రొత్తవిషయంబులం దరచితరచి యట్టివనీతములనఁ బరిషత్తునారా ధించుట నా యుద్యమముగాదు. కాకతీయులు క్షత్రియేతరు లని సిద్ధాంతపఱు చుటకు వారు గైకొనిన కారణము లెంతసారవంతములో యాప్రమాణగ్రంథ

ముండే వాని కెన్ని బాధకములు గలవో యందెన్ని బాధకములను మాత్ర మను
సరించినో వానిని సవరింపవలెనని యెంతవరకు శేముషీసారమును వెచ్చించినో
యింపుగ నొందుపఱచుట నాకర్తవ్యము. సదసద్వివేచనచతురు లగుసత్పురుషు
లింతలిగుణదోషంబులు విచారింపఁ బ్రార్థించుచున్నాఁడను.

మ-రా-శ్రీ, జయంతి రామయ్యపంతులుగారు సాహిత్యపరిషత్పత్రికలో
"అనితల్లిశాసనమును" ప్రకటించినప్పుడు కాకతీయులు క్షత్రియేతరు లని నిర
భ్యంతరముగా నూహింపవచ్చు నని నాయభిప్రాయము. అని వ్రాయించి యు
న్నారు. వీ రింతనిరభ్యంతరముగా నూహించుటకుం బ్రతాపరుద్రీయమునుండి
రెండుకారణములు నిచ్చియుండిరి. [1] కాకతీయులు సూర్యవంశచంద్రవంశజుల
కంటె భిన్నవంశజులుగా వర్ణింపఁబడుట. [2] కాకతీయరాజులకు క్షత్రియులతో
విరోధ మున్నట్లు చెప్పఁబడుట.

ప్రథమకారణము:—సాధారణముగా క్షత్రియులు సూర్యవంశమందో
చంద్రవంశమందో పుట్టినవా రని చెప్పుట పేరసంప్రదాయము గాన సూర్య

---

[1] శ్లో. తాన్ప్రత్యక్షయమలోకభాగ్యవిభవా నింద్రాదిబృందారకాః
క్షోణ్యాం క్రీడితు మిచ్ఛతి శ్చిరతరం సంప్రార్థితః సాదరమ్
అత్యర్కేందుకులప్రశస్తిమహనీయం కాకతీయాన్వయం
తస్మిన్ సంప్రతి వీరరుద్రనృపతా నామ్నా లక్ష్మీపతిః.

అని నాయకప్రకరణమందును

[2] శ్లో. సోమార్కాభిజనంలమధ్యజయతి శ్రీకాకతీయాన్వయం.

శ్లో. సోమసూర్యాన్వయామాత్యమహాత్వా ద్యాంగదీక్షితా
ఆశాభేదినసాన్యాస్తి కాకతీ మహుపస్థితిః.

గ. స్వామి న్నేతే సోమార్కవంశ్యా నరపతయః మహతీ మన్మనా మన్యంతి తేన స్వేషు
స్వేషు ప్రదేశేషు స్థాపనీయాః ప్రస్థాపనీయాశ్చ.

శ్లో. సాహంప్రాంతవ మైంపవంచ మహా[illegible] యేన్వేతే నిత్యశో।
తే జాతే లఘునీ గుణైర్విజయిని శ్రీకాకతీయాన్వయే.

అని యక్కడక్కడ నాటకప్రకరణమందును

శ్లో॥ క్షుద్రక్షత్రియపక్షశిక్షణవిధౌ ప్రోత్కీర్తకాంక్షాయుతః.

అని కావ్యప్రకరణమందును

కాకతీయవంశము సూర్యచంద్రవంశములకంటె భిన్నమైనట్లును కాకతీయరాజులకును
క్షత్రియరాజులకును విరోధమున్నట్లును జెప్పఁబడినది గాన కాకతీయులు క్షత్రియేతరు లని నిర
భ్యంతరముగ నూహింపవచ్చు నని నాయభిప్రాయము. (ఆం, సా. ప.)

ద్రవంశజులు గాని కాకతీయులు క్షత్రియేతరు లని వీరు సిద్ధాంతపఱిచిరి. శసంప్రదాయము పైరీతిగ నున్న దని మన దేశమందలి శ్రుతిస్మృతిపురాణేతి సాదిశబ్దప్రమాణమును బట్టియేకదా వీరు తెలిసికొని యుండిరి. అద్దాని మక పరిశీలింతము.

[1]పురుషోత్తముని బాహువులనుండి క్షత్రియులు పుట్టి రని—శ్రుతి చెప్పు న్నది.

[2]హిరణ్యగర్భుని బాహువులనుండి క్షత్రియు లుద్భవించి రని—మను ృతి చెప్పుచున్నది.

[3]శ్రీరామాదులు సూర్యవంశపు క్షత్రియులైనట్లు—శ్రీమద్రామాయ ము వర్ణించుచున్నది. ఇందువలన సూర్యచంద్రవంశములకుఁ జెందని క్షత్రియ ంశ మొకటి వర్ణిత మయ్యె.

[4]యుధిష్ఠిరాదులు చంద్రవంశజులుగా మహాభారతమునందు వర్ణిస్తులైరి. ందుస సూర్యచంద్రాన్వయులుగాని క్షత్రియవంశముల ప్రశంస గలదు. సూర్యచంద్రవంశముల ప్రశంస భాగవతమునందు విస్తరింపఁబడియున్నది.)

[5]నలమహారాజు, కార్తవీర్యుఁడు నిందుఁ గన్పట్టుదు. దేశసంప్రదాయ మును బరిశీలించినకతంబున కాకతీయులు సూర్యచంద్రవంశజులకంటెఁ బ్రశస్తి లవా రనుటకుఁ గలకారణముగూడఁ బోడకట్టుచున్నది. శ్రుతిస్మృతిపురాణేతి సాదులలోఁ బురాణేతిహాసాద్యుపపాదిత మైనధర్మముకంటె శ్రుతిస్మృత్యుక్త ర్మము ప్రశస్తమైనట్లుగనే పురాణాదివర్ణిత సూర్యచంద్రవంశ్యక్షత్రియులకంటె శ్రుతిస్మృతివర్ణితక్షత్రియవంశము ప్రశస్తి కల దని విద్యానాథమహాకవి యాశ

---

[1] బ్రాహ్మణో స్యముఖమాసీత్ బాహూరాజన్యఃకృతః.

[2] లోకానాం తు వివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః
బ్రాహ్మణ్యం క్షత్రియం వైశ్యం శూద్రంచ నిరవర్తయత్॥

[3] ప్రజాపతిసుత శ్చాసీత్ కుశో నామ మహీపతిః
కుశస్య పుత్రో బలవాన్ కుశనాభ స్సుధార్మికః॥
కుశనాభసుత శ్చాసీ ద్గాధి రిత్యేవ విశ్రుతః
గాధేః పుత్రో మహాతేజా విశ్వామిత్రో మహామునిః॥　శ్రీమద్రామాయణమ్.

[4] మత్స్యవంశము - ఆదిపర్వము. శైన్యవంశము - శాంతిపర్వము.

[5] హైహయవంశము - [illegible]హయవంశము. ఇవి సూర్యచంద్రవంశాంతర్గతములుగఁ గన్పట్టవు.

యము. కావుననే కాకతీయులు [1]హిరణ్యగర్భనిదోఃప్రసూతి యని వర్ణించి యుండె. ఇట్టి బాధకముగానున్న విషయము గలశ్లోకమునందలి ప్రథమపాదమును బ్రథమకారణముగ ఋజువుచేయుటకు నిచ్చియుండిరి. వీరుప్రమాణముగఁ దీసికొన్న శ్లోకమునందలి తృతీయపాదమే వీరికిఁ బ్రబలబాధక మైనది. దీనిని వీరు చూచుకొనలేదు. మీఁద నేను జూపియున్న ప్రమాణమువలన శ్రీరామయ్యపంతులుగారు దయచేసిన ప్రథమకారణ మతివ్యాప్తిదోషదూషిత మైనకారణాభాస మని స్పష్టపడఁగలదు.

ద్వితీయకారణము:—ఇది మొదటిదానికంటెను దుర్బలతరము. వీరు బ్రాహ్మణులగుట వలన "క్షుద్రక్షత్రియపక్షశిక్షణవిధా ప్రోక్షిప్త కౌక్షేయకాః" అనువాక్యము శ్రవణగోచరము కాఁగానే వీరికి భార్గవరామచరిత్రము జ్ఞాపకము వచ్చియుండఁబోలును. శస్త్రోపజీవు లగుక్షత్రియులకు క్షత్రియులతోడి విరోధము నిత్యమే. యుధిష్ఠిరాదులవలెనే కాకతీయులు క్షుద్రక్షత్రియులఁ దున్మాడి సామ్రాజ్యమును సంస్థాపించిరి. క్షత్రియుల ముఖములపై శోణవర్షము కురిపించె నని యున్నదిగాన నర్జునుఁడు క్షత్రియేతరుఁ డందురా?[2] క్షత్రియులు క్షత్రియులతోఁ బోరాడుకొని రనుట కితిహాసపురాణములందు వేనవేలు కథలు కలవు. కాన నిదియు నతివ్యాప్తిదోషదూషితమైనకారణాభాసమే.

---

[1] శ్లో॥ సోమార్కాభిజనం తమస్య జయతి శ్రీకాకతీయాన్వయం
పాతి ప్రత్యు ముపైతి సాంప్రత మమీ ష్వప్యస్మాసు విశ్వంభరా
అస్మాభి ర్ద్విజదోఃప్రసూతి మధునా ధన్యా వయం మన్యతే
యత్కాన్త్వ ముపాదిశ త్కులపతి ర్దేవః స్వయంభూప్రభుః॥

ప్రస్తుత మైనశాసనమునందును "వర్ణ్యం చాతుర్వర్ణ్యం విష్ణోః పదభూచ్చ ముఖభుజోరుపదాత్" అని వ్రాయఁబడినది.

[2] రాజన్యానాం శితశరశతై ర్యత్ర గాండీవధన్వా
ధారాసారై స్త్వమివ కమలా న్యభ్యవర్ష న్ముఖాని॥

రాజన్యానాం (అనఁగా) క్షత్రియాణాం (అన్నమాటయే.) రాజకం రాజన్యకం చ నృపతిక్షత్రియాణాం గణే క్రమాత్ - అమరకోశము. రాజశ్వశురాద్యత్. రాజ్ఞో జాతావేవేతి వక్తవ్యం రాజన్యః శూద్రాద్రా ఉత్పన్నస్తు రాజనః - భట్టోజీదీక్షితీయము. పాణినియము రాజశ్వశురశబ్దములకంటె నపత్యార్థమందు యత్ప్రత్యయమును విధించెను. అందు రాజశబ్దముకంటె వచ్చినచో జాతివివక్ష గలిగి నప్పుడే వచ్చును. రాజన్యః-అనురూపనిష్పత్తియగును. క్షత్రియునకు క్షత్రియజాతిస్త్రీయందుఁ బుట్టినవాఁడు రాజన్యుఁడు. క్షత్రియునకు శూద్రజాతిస్త్రీయందుఁ బుట్టినవాఁడు రాజనుఁడు. అప్పుడు యత్ప్రత్యయము రాదు. అణ్ప్రత్యయమువలన రాజనుఁడగును.

వీరు పైనిచ్చియుంచిన హేత్వాభాసములకు బాధకముగఁ గాకతీయులు క్షత్త్రియమౌళిమండనము లని యాప్రతాపరుద్రీయములోనే యున్నది. దీనిని వీరు చూచుకొని,

శ్లో. ఆమూలాత్ఫలితా ప్రసక్తిలతికా పత్యుః స్వయంభూప్రభో।
రాజ్ఞా క్షత్త్రియమౌళిమండనమణే ప్రాతస్యసానుగ్రహః॥

ఇక్కడ క్షత్త్రియమౌళిమండనమణే యనువిశేషణమున క్షత్త్రియ శబ్దము సామాన్యభూపాలవాచకముగ గ్రహింపవలయు నని వ్రాయించిరి. ఇది శబ్దమర్యాదను గాని ప్రకరణసందర్భమును గాని పాటించి వ్రాయించిన వ్రాఁతకాదు.

ఆర్థికమర్యాద:—ఇది నాలుగువిధములుగ నున్నది. ౧. యోగము. ౨. కేవలరూఢము, ౩. యోగరూఢము, ౪. యౌగికరూఢము నని. యోగ మనఁగా నవయవార్థమునుబట్టి సర్వత్ర వర్తించునది. ఉదా. పాచకః - పచన కర్తచేయువా రందఱియందును వర్తించును. కేవలరూఢమనఁగా నవయవార్థముతో సంబంధ మేమియు లేక రూఢిగా నొకచోటనే వర్తించునది. ఉ. అశ్వకర్ణము. ఇది మద్దిచెట్టును బోధించును. యోగరూఢము, అనఁగా నవయవార్థము గలిగి యొకచోటనే వర్తించును. ఉ. పంకజము. పంకమునందుఁ బుట్టిన దనునర్థముగలిగి పద్మమందు రూఢిగ వర్తించును. పంకమునఁబుట్టిన యితరము నందు వర్తింపదు. యౌగికరూఢమనఁగా, నవయవార్థమునుబట్టి యొకచోటను రూఢినిబట్టి యొకచోటను సందర్భానుసారముగ వర్తించునది. ఉ. ఉద్భిత్. ఉన్నతముగా మొలచునదియను నవయవార్థమునుబట్టి తరుగుల్మాదులందును, "ఉద్భిదాయాజయేత్" అన్నప్పుడు రూఢినిబట్టి "ఉద్భిద్" అను నొకయాగమునందును సందర్భము ననుసరించి వర్తించుచుండును.

ప్రకృతమైన క్షత్త్రియశబ్ద మెట్టిదో విమర్శింతము:—క్షత్త్రియశబ్దము యోగరూఢ మని మల్లినాథసూరి రఘువంశమహాకావ్యవ్యాఖ్యానమునందు వ్రాయఁబడియున్నది. క్షతాత్ త్రాయత ఇతి క్షత్త్రం - క్షతమునుండి రక్షించునది యనునవయవార్థముగలిగి ద్వితీయజాతియందు మాత్రమే రూఢిగ వర్తించునది. కావుననే క్షత్త్రజాతి యనునర్థము తప్పక రావలసిన తావులం దెల్ల క్షత్త్రశబ్దమే ప్రయోగింపఁబడుచు వచ్చె ననుటకుఁ గాళిదాసమహాకవి యభిజ్ఞానశాకుంతలములోని,

[1]శ్లో. అసంశయక్షత్రపరిగ్రహక్షమా యదార్య మస్యా మభిలాషి మేమనః
సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః.

అనుశ్లోకమునందలి క్షత్రశబ్దమును జూచినఁ జాలును. అమరుఁడుఁ గూడ ద్వితీయజాతిని జెప్పవలసి వచ్చినప్పుడు "నృబ్రహ్మక్షత్రవిట్శూద్ర" యని క్షత్రపదముచేతనే చెప్పెను. అట్టి క్షత్రశబ్దముకంటె జాతివివక్షతోఁ గూడిన యపత్యార్థమందు ఘప్రత్యయము విధింపఁబడి యీవిశేషవిధి వలన క్షత్రియశబ్దము నిష్పన్నమైనది. జాతివివక్షలేని యపత్యార్థమందు అతఇఞ్ అను సామాన్యవిధివలన క్షాత్రిశబ్దము పుట్టుచున్నది. ఈ క్షాత్రిశబ్దమును ౨౨-వ శతాబ్దమునందలి విమర్శకమహాశయులు తమయిచ్చవచ్చిన ట్లన్వయించుకొందురుగాక. క్షత్రియశబ్దము జాతిబోధకమైన యోగరూఢపదమని శబ్దమర్యాద ననుసరించి తెలిసికొనియున్నాము. దీనిని సామాన్యభూపాలవాచకముగ గ్రహింతమనుట శబ్దమర్యాదకు విరోధము.

ప్రకరణవిరోధము:—ఈశ్లోకము నాటకప్రకరణములోనిది. విద్యానాథమహాకవి యీప్రకరణమునందు మున్ను న్నాగ నాటకలక్షణములు చెప్పి వానికి నుదాహరణముల నిచ్చుచు లక్ష్యలక్షణసమన్వయము కొఱకు నాటకమును రచించి యున్నాఁడు. ప్రకృతానుకూలముగఁ గొన్నింటి నిక్కడ నిచ్చుచున్నాను. ౧. ముఖసంధి, ౨. ప్రతిముఖసంధి, ౩. గర్భసంధి, ౪. విమర్శసంధి, ౫. నిర్వహణసంధి యని నాటకమున నైదుసంధు లనుసంధింపఁ దగినది. ఇందుఁ బ్రతిముఖసంధికి బిందుప్రయత్నానుగుణంబుగ ౧౩ అంగములు చెప్పఁబడినవి.

శ్లో. విలాసః పరిసర్పశ్చ విధూతం శమనర్మణీ
నర్మద్యుతిః ప్రగమనం విరోధః పర్యుపాసనమ్
వజ్రంపుష్ప ముపన్యాసో వర్ణసంహారఇత్యపి.

---

[1] దీనికి మహాంధ్రీకృతశాకుంతలమునందలి పద్యము:—

ఉ. వంకరలేనిత్రోవ కలవాటయియుండిన నాయెడంద యిం
దుంకువ వోవుచున్కి నన్నుతోదరి క్షత్రవివాహయోగ్య. ని
శ్శంకముగాఁగ సంశయవశమ్మగు వస్తువులందు చిత్తమే
వంకకు వ్రాలునో యదిధ్రువంబ ప్రమాణము సజ్జనాళికిన్.

శ్లో. క్షతాత్కిలత్రాయత ఇత్యుదగ్రః క్షత్రస్యశబ్దో భువనేషురూఢః
రాజ్యేనకిం తద్విపరీతవృత్తేః ప్రాణైరుపక్రోశమలీమసైర్వా. (రఘువంశము).

౧. విలాసము - సంభోగవిషయమనోరథము. ౨. పరిసర్పము - దృష్ట నష్టపదార్థానుసరణము. 3. విధూతము - అనిష్టవస్తువిక్షేపము. ౪. శమము - అరత్యుపశమము. ౫. నర్మము - పరిహాసవచనము, ౬. నర్మద్యుతి - అనురాగోద్ఘాటనోదితప్రీతి. ౭. ప్రగమనము - ఉత్తరోత్తరవాక్యమూలానురాగబీజప్రకాశనము. ౮. విరోధము - హితాగమకైతవనిరోధనము. ౯. పర్యుపాసనము - ఇష్టజనానునయము. ౧౦. వజ్రము - ప్రముఖనిష్ఠురవచనము. ౧౧. పుష్పము - అనురాగప్రకాశవిశిష్టవచనము. ౧౨. ఉపన్యాసము - అనురాగహేతువాక్య రచన. ౧3. వర్ణసంహారము - చతుర్వర్ణనిర్వర్ణనము.

వీనికన్నింటికిని రెండవయంకమున నుదాహరణము లీయఁబడినవి. శ్రీరామయ్యపంతులుగారి సిద్ధాంతమునకు బాధకముగా నున్నక్షత్త్రియశబ్దముగల శ్లోక మిందు వర్ణసంహారమున కుదాహరణముగా నీయఁబడినది. ఈవిషయము శ్లోకము నాలుగుపాదములు పూర్తిగాఁజదివి దానిక్రిందఁ గీటుగీచి యున్న పంక్తిని జూచినచో విస్పష్టము కాఁగలదు.

శ్లో. ఆమూలాత్ఫలితా ప్రశస్తిలతికా పత్యుః స్వయంభూప్రభో
రాజ్ఞా క్షత్త్రియమౌళిమండనమహో స్నాతస్య సానుగ్రహం
విప్రాశీర్వచనాని మన్త్రసురభీ ణ్యాకాంక్షితా స్యన్వహం
పౌరాణాంచ జయోత్తరాణి యదమూ రీషజ్జయా స్స్వర్ధిరే.
ఏష బ్రాహ్మణక్షత్త్రియాదివర్ణకీర్తనా ద్వర్ణసంహారః.

ఈశ్లోకమునందు బ్రాహ్మణక్షత్త్రియాది వర్ణముల ప్రశంస గలదు గాన నిది వర్ణసంహారమున కుదాహరణమనియు విద్యానాథుఁడే వ్రాసియున్నాఁడు. ఇంకలి క్షత్త్రియశబ్దము సామాన్యభూపాలవాచకముగ గ్రహింపఁబోయినచో విద్యానాథుని వ్రాతకుఁ గతి యేమి? ఇందు బ్రాహ్మణక్షత్త్రియవర్ణకీర్తన చేసితి ననికదా యతఁడు వ్రాసినాఁడు. ఇక్కడ క్షత్త్రియశబ్దమునకు సామాన్యభూపాలపరముగ సమన్వయించెదరో. ఇది ప్రకరణవిరోధము. కనుక కాకతీయులు క్షత్త్రియమౌళిమండనములు గాని సామాన్యభూపాలకులు గారు. మఱియుఁ గొంత పరిశిష్ట మున్నది. ప్రస్తుతపు శాసనమునఁ గాకతీయవంశకూటస్థుఁడు కూష్మాండవల్లికనుండి వచ్చినట్లున్నది గాన నింకలి యమానుషోత్పత్తి కథనము కూడఁ దమయూహను ధ్రువపఱుచుచున్న దని శ్రీరామయ్యపంతులుగారు వ్రాయించియున్నారు. ఆశ్లోకము నిక్కడ నించుక వివరించుచున్నాను. అప్పుడీవిషయ మేపక్షమున కనుకూలమో మహాశయులకు విశదము గాఁగలదు.

శ్లో. కాకత్యాః పరశక్తేః కృపయా కూశ్మాండవల్లికా కాచిత్
పుత్త్ర మసూత తద్దేశ త్కులమనఘం కాకతీయసంజ్ఞంస్యాత్.

కూశ్మాండవల్లిక మనుష్యుని బ్రసవించుట యసంభవము గాన నిక్కడ లక్షణచేత నన్వయించుకొనవలెను. గంగాయాం ఘోషః అన్నపుడు గంగలోఁ బల్లెయుండదు గాన గంగయొడ్డునఁ బల్లెయున్న దనుకొనవలయును. అట్లే కూశ్మాండవల్లిక కొడుకుఁ గనియె నన్న బూడిదగుమ్మడి కాయను గాచె ననుకొనవచ్చును గదా. కూశ్మాండము కాచుటకుఁ బరశక్తి యనుగ్రహ మక్కఱలేదు. పరశక్తి యగు కాకతికృపచేత నాబూడిదగుమ్మడికాయలోనికి నొకశిశురత్నము ప్రవేశపెట్టఁబడి రక్షింపఁబడియుండును. కాకతీయులు పూర్వులు శస్త్రోపజీవు లగుటవలన బలవచ్ఛత్రువులతోడి యుద్ధము సంభవించినప్పుడు రానున్నయని వార్యమైన యాపదనుండి వారివంశాంకురమైన శిశురత్నమును నైవిధముగఁ దప్పించి యభివృద్ధికి వచ్చునట్లుచేసినవారు వీరస్వర్గమును జూఱగొనియుండ వచ్చును. అనంతరమా పురుషరత్నము పేరుపెంపు వడసినవాఁడు కావచ్చును. అమ్మహాపురుషునివంశము కాకతీయసంజ్ఞము కావచ్చును. ఇట్టిప్రతీతిగల క్షత్త్రియకుటుంబములు మనయాంధ్రదేశమునఁ గొన్నిగలవు. కాశ్యపగోత్రజాతు లగుమంచపాటివారు, ఉప్పలపాటవారు మున్నగువారు తమకుటుంబమునగూర్చి యిట్టిప్రతీతినే చెప్పుకొనుటయె కాక బూడిదగుమ్మడికాయను భక్షింపఁగూడ దను నియమము గలిగి యున్నారు. దీని కనుకూలముగ క్షత్త్రియగోత్ర సీస మాలికలో

శ్రీమన్మహాపగిచ్ఛేదిసర్గాటకకోట కాకతివంశపాటవమున
నెగడు వసిష్ఠ కౌండిన్య ధనంజయ కాశ్యపగోత్రముల్ గణనసేయఁ
మహనీయచారిత్ర మహితవిక్రములైన వత్సవాయియుఁ బూసపాటిసాగి.

మంచపాటివారు నుప్పలపాటివారు మున్నగు కాశ్యపగోత్రమువారికిఁ గాకతీయోపసంజ్ఞకూడఁ గల దని తోఁచుచున్నది. ఇంతియ కాక కూచిమంచి జగ్గకవిప్రణీతమైన సోమదేవరాజీయములో మందపాటివారు కాకతీయాన్వయము నుండి పుట్టినట్లు మూఁడవయాశ్వాస ప్రారంభమున

క. శ్రీకాకతిరుద్రాన్వయ! నాకాధిప మందపాటి నారాయణధా
త్రీకాంత హృదయకమల! ప్రాకారనివేశ సత్యభామాధీశా.

అని చెప్పఁబడియున్నది. మఱియు విజయనగరరాజ్యప్రతిష్ఠాపనాచార్యులును సరసకవితాధురీణులు నగుశ్రీపూసపాటి తమ్మిరాజుగారిచేత రచియిం

పఁబడిన కృష్ణవిజయములో మందపాటివారు కాకతీయాన్వయమునుండి పుట్టినట్లు

సీ. కాకతీయాన్వయ కమలాబ్ధిచంద్రుని సుహితసద్గుణకోటి మందపాటి
కృష్ణరాయని పుత్త్రి కేవలభాగ్యలక్షణలక్షితక్షమాగుణధరిత్రి
తమ్మప్పదేవియు ధార్మికాగ్రణి మందపాటి శ్రీరఘుపతిపార్థివేంద్రు
తనయ జగ్గపదేవి యనఁగఁ బాతివ్రత్యధర్మనిర్మలగుణౌదార్యశీల
యాయరుంధతితోడ ననసూయతోడ, సాటియగుదురు వీరని సకలబంధు
నరులు వర్ణింపఁ గీర్తిఁగాంచిరి దయాని, ధానమతులైన యట్టి సీమంతినులు.

అని చెప్పఁబడినది. కూశ్మాండవల్లికథ జరిగిన మూఁడుశతాబ్దములకు అనితల్లి శాసనమునకెక్కి పరంపరగాఁ జెప్పుకొనఁబడు కథనుబట్టియే యప్పటివారు శాసనస్థముగావించి యుండిరి. అట్లే యాకుటుంబపారంపర్యముగ నాకథ యిప్పటికిని వాడుకలోనున్నది. కావున మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు తమయూహను ధ్రువపఱచుచున్నదను కూశ్మాండవల్లికథయుఁ గాకతీయులు క్షత్త్రియులను సిద్ధాంతమునే ధ్రువపఱచుచున్నది. ఇంకఁ గాకతీయులు క్షత్త్రియేతరు లనుట యుక్తమో క్షత్త్రియులనుట యుక్తమో బుద్ధిమంతు లూహింతురుగాక. శ్రీరామయ్యపంతులుగారు తమసిద్ధాంతమున కేగ్రంథమును బ్రమాణముగాఁ దీసికొని యుండిరో యాగ్రంథమునందే కాకతీయులు దోఃప్రసూతులనియు క్షత్త్రియమౌళిమండనులనియు నేతదక్షరములతో వర్ణింపఁబడి యుండుటయు, నమ్మఁదగిన మఱికొన్ని శబ్దప్రమాణములవలనను గాకతీయుల సంతతివా రని నమ్మఁదగియున్న క్షత్త్రియులు, అనితల్లి శాసనమునందలి కూశ్మాండవల్లికథను గులక్రమాగతముగఁ జెప్పుకొనుచుండుటయు మనయాంధ్రదేశమునఁ జరిత్రప్రసిద్ధి వహించి విశాలమైనరాజ్యమును మిక్కిలి వన్నెయుఁగాంచి యున్నవిజయనగరాధీశులును గాకతీయులు క్షత్త్రియు లని చెప్పుటయు నేతత్సాహిత్యపరిషత్ప్రతిష్ఠాపకులును జిరకాలము కాకతీయులకు సైన్యాధిపతులుగానుండి వారివలనఁ బెక్కుమన్ననలఁ బొంది యప్పటినుండియుఁ జరిత్రప్రసిద్ధి వహించి తెనుఁగుదేశమునఁ బెక్కుసంస్థానములు స్థాపించి యున్న వేంకటగిరి సంస్థానాధీశ్వరులును గాకతీయులు క్షత్త్రియు లని చెప్పుచుండుటయు నను ప్రబలప్రమాణములు కాకతీయులు క్షత్త్రియులని ఋజువుచేయుచున్నవి.

కాకతిప్రతాపరుద్రమహారాజుకుమారుఁడ నని చెప్పుకొనిన రెడ్డిశాసన మొకటి గలదు. ఇతఁడు ప్రతాపరుద్రున కౌరసపుత్త్రుఁడైనదియు మఱియొక

పుత్త్రుఁడైనదియు భావిపరిశోధనలవలనఁ దేలవలసియున్న దని యాంధ్రుల
చరిత్రకారులు వ్రాసిరి. ఈచరిత్రకారులే గణపతిదేవుఁడు చక్రవర్తిపదవిఁ
బొందినపిదప నీతని ఘనత నిరూపించుటకై సూర్యవంశ్యుఁ డని శ్లాఘింపఁబడి
నట్లు వ్రాసిరి. గణపతిదేవునినాఁటికే సూర్యవంశక్షత్త్రియులుగ శ్లాఘింపఁ
బడుచున్న కాకతీయులు ప్రతాపరుద్రునివఱకు క్షత్త్రియు లని చెప్పుకొని
ప్రతాపరుద్రుని యౌరసపుత్త్రుఁడు తాను రెడ్డి నని ప్రకటించుకొనునా. కనుక
నితఁడు భోగభార్య పుత్త్రుఁడే యై యుండవలయును.

సభాధ్యక్షాదిసభ్యవతంసులార! నేను మీయెదుటఁ బ్రతిశ్రుతపఱిచిన
విషయమునందు శతాంశమైన నెఱవేర్చుకొనఁగలిగినచో నది తమయాశీః
ప్రభావమే. ఉభయపక్షములందును నేపక్షమునందలి ప్రమాణములు దుర్బ
లంబులో యెయ్యవి ప్రబలంబులో యిదమిత్థమని నిర్ణయించుట మీకుఁ గర్తవ్య
మనుమాటను జ్ఞాపకము చేసి నావ్యాసమును ముగించుచున్నాను.

నస్సివాయ వేంకటనీలాద్రిరాజు.

---

## II

కొన్నిశాసనములను బట్టియు విద్యానాథకృత మగుప్రతాపరుద్రీయమును
బట్టియుఁ గాకతీయరాజులు క్షత్త్రియేతరు లైన ట్లూహింపఁదగి యున్నదని నేను
నా మొదటివ్యాసమునందుఁ జెప్పియున్నాఁడను. ఆమతమును ఖండించుచుఁ
గాకతీయులు క్షత్త్రియులే యని శ్రీనీలాద్రిరాజుగారు ప్రతిపాదించినారు. నీలా
ద్రిరాజుగారు క్షత్త్రియులు. కాకతీయవంశజులని వ్యవహరింపఁబడుచున్న మం
దపాటివారికి బంధువులుకూడఁ గావచ్చును. కాఁబట్టి యాయన కాకతీయులు
క్షత్త్రియు లని సాధింప యత్నించుట వింత గాదు. ఆవాదము తప్పని యేవి
ధమున నైనను సాధింపవలయు నని పట్టుపట్టవలసిన నిమిత్తము నాకు లేదు. నాకు
దొరకిన యాధారములనుబట్టి కాకతీయరాజులు క్షత్త్రియులు కా రని తోఁచి
నందున నే నట్లు వ్రాసినాఁడను. నీలాద్రిరాజుగారు చెప్పిన హేతువులను
జక్కఁగాఁ బరిశీలించితిని. కాని నాపూర్వపు టభిప్రాయమును మార్చుకొను
టకుఁ దగిన కారణము లందుఁ గనఁబడ లేదు.

కాకతీయులు సూర్యవంశపుక్షత్త్రియులును జంద్రవంశపుక్షత్త్రియులును

గా రని ప్రతాపరుద్రీయము చాటుచున్నది. ఇది కా దని నీలాద్రిరాజుగా రన లేదు. అన లేరు. కాని కాకతీయులు క్షత్రియు లని ప్రతాపరుద్రీయమునం దచ్చటచ్చట నున్నది కావున వారు వర్ణమున క్షత్రియు లనియే విద్యానాథుని యాశయమని నిర్ణయింపవలయు ననియు సూర్యచంద్రవంశములకంటె భిన్న మగుక్షత్రియవంశములు కొన్నిపురాణములయందు వర్ణింపఁబడి యున్న వనియుఁ గాకతీయవంశముకూడ నట్టిక్షత్రియవంశము కావచ్చు ననియు రాజుగారివాదము. రాజుగారుచెప్పిన యుపపత్తులనుబట్టి చూడఁగాఁ గాకతీయులు వర్ణముచేత క్షత్రియు లనియే విద్యానాథుని యాశయ మని యూహింపవచ్చును. ప్రతాపరుద్రీయములోఁ గాకతీయులు క్షత్రియులని కొన్నిచోటులఁ జెప్పఁబడి యున్నమాట సత్యము. అచ్చట క్షత్రియపదములు వర్ణవాచకములు కా వనుటకుఁ దగినకారణములు లేవు. కావున విద్యానాథుఁడు కాకతీయులను క్షత్రియు లనియే వర్ణించినాఁ డని యొప్పికొందము. సూర్యచంద్రవంశములకంటె భిన్నమయిన క్షత్రియవంశములు కొన్ని పురాణములయందు వర్ణింపఁబడినట్లు కూడ నొప్పికొందము.

అంతమాత్రముచేతఁ గాకతీయులకు క్షత్రియత్వము సిద్ధింపఁజాలదు. విద్యానాథుఁడు కవి, ప్రతాపరుద్రుఁడు కృతిపతి. కృతిపతి నుత్తమనాయకునిగా వర్ణించుట కవికిఁ గర్తవ్యము. అందులోఁ బ్రతాపరుద్రుఁడు గొప్పప్రభువు. అతఁడు క్షత్రియుఁ డని విద్యానాథుఁడు చెప్పుటలో విశేషము లేదు. అది సామాన్యకవ్యాచారమును బట్టి చెప్పినమాట. ఇట్టి వాక్యములు నిర్బాధకములుగా నున్నప్పుడు ప్రమాణములుగా గ్రహింపఁదగినవే గాని సబాధకములయినప్పుడు ప్రమాణములు కానేరవు. విద్యానాథునివాక్యము ప్రబలప్రమాణముచే బాధింపఁబడుచున్నది. ఎట్లన:—

కాకతీయరాజులకాలమందుఁ బుట్టిన శాసనము లనేకము లున్నవి. ఇంతవఱకు దొరకినవే వందలకొలఁది గలవు. ఈశాసనములలోఁ గాకతీయవంశావతార క్రమ మి ట్లున్నది. ౧. ప్రోలరాజు. ౨. ఇతనికొడుకు త్రిభువనమల్లదేవుఁ డనుబిరుదముగల చేతరాజు. ౩. ఇతనికొడుకు ప్రోలరాజు. ౪. ఇతనికొడుకు రుద్రదేవుఁడు. ౫. ఇతనితమ్ముఁడు మహాదేవుఁడు. ౬. ఇతనికొడుకు గణపతిదేవుఁడు. ౭. ఇతనికూఁతురు రుద్రమదేవి. ౮. ఈమె దౌహిత్రుఁడు ప్రతాపరుద్రదేవుఁడు. వీరిలో గణపతిదేవుఁడు చిరకాలము రాజ్యము చేసి రాజ్యమును వృద్ధి పొందించెను. సముద్రప్రాంతమందలి యాంధ్ర

దేశము నంతకుఁబూర్వము పాలించుచుండిన చోళవంశపురాజుల జయించి యాదేశము నాక్రమించుకొనియెను. చోళరాజుల జయించుటకుఁ బూర్వము గణపతిదేవుని కాలమందుఁ గాని తత్పూర్వరాజుల కాలమందుఁ గాని పుట్టినశాసనములలో నెచ్చటను గాకతీయులు క్షత్త్రియులనుట కాధారములు లేవు. గణపతిదేవుని పెదతండ్రి యగురుద్రదేవుని కాలములోఁ బుట్టిన శాసన మొకటి యనుమకొండలో వేయిగాళ్లమంటపము సమీపమున స్థాపింపఁబడి యున్న శిలాస్తంభముమీఁదఁ జెక్కఁబడియున్నది. ఇది విక్కలి పెద్దశాసనము. రాజవంశమును వర్ణింతు నని కవి ప్రతిజ్ఞ చేసియున్నాఁడు. నిజముగాఁ గాకతీయులు క్షత్త్రియులే యైనచో నీశాసనమం దామాట తప్పక యుండియుండును. శాసనమందు రుద్రదేవుఁడు "కాకత్యవంశ సంభూతుఁ" డనిమాత్రమే యున్నది గాని క్షత్త్రియుఁడని లేదు. ఈలోపము కాకతీయక్షత్త్రియత్వవాదమునకు బాధకము కాక మానదు. ఈశాసనములో వంశావతారవర్ణనభాగము నీవ్యాసమునకుఁ బ్రథమానుబంధముగా నుదాహరించుచున్నాఁడను. ఈభాగమును నాయొద్దనున్న శాసనప్రతిబింబమును బట్టి యెత్తివ్రాసినాఁడను. శాసనమునంతయుఁ జూడఁగోరువారు (Indian Antiquary) ఇండియన్ అంటిక్వరీయను పత్త్రిక చూడవలయును.

చోళులు తాము సూర్యవంశపురాజు లని మొదటినుండియుఁ జెప్పుకొనుచుండిరి. అట్టిచోళరాజులను జయించినపిదప గణపతిదేవుని కాలములోఁ బుట్టిన కొన్ని శాసనములలోఁ గాకతీయులు సూర్యవంశపుక్షత్త్రియు లని చెప్పఁబడియున్నది. అట్టిశాసనములలో నొకటి గుంటూరుమండలమందు మోటుపల్లిగ్రామములో శ్రీవీరభద్రేశ్వరస్వామి యాలయమునసమీపములోఁ బాఁతఁబడియున్న ఱాతిపలకమీఁదఁ జెక్కఁబడి యున్నది. అందలి వంశావతారవర్ణనభాగము రెండవ యనుబంధముగా నుదాహరించుచున్నాను. ఈశాసనమును సమగ్రముగాఁ జదువఁగోరువారు Epigraphia Indica యనుపత్త్రిక ౧౨-వ సంపుటము చూడవలయును. కాకతీయులు సూర్యవంశక్షత్త్రియు లని యాశాసనమునందు స్పష్టముగ నున్నది. ఇటులే మఱి మూఁడునాలుగు శాసనములందున్నది. కాని గణపతిదేవునియనంతరము పుట్టినశాసనములలో నెక్కడ నీవిషయము కానరాదు. గణపతిదేవుఁడు సూర్యవంశపురాజులైన చోళుల జయించినపిమ్మటఁ బుట్టిన కొన్నిశాసనములలోఁ గాకతీయులు సూర్యవంశపుక్షత్త్రియు లనియున్నది. అంతకుఁబూర్వము పుట్టిన శాసనములలోఁ గాని గణ

పతిదేవుని యనంతరము పుట్టిన శాసనములలోఁ గాని యీమాట లేదు. సరి
గదా కాకతీయులు క్షత్రియు లనుటకుఁ గూడఁ దగినయాధారములు లేవు.
ఇది యిట్లుండ గణపతిదేవుని మునిమనుమఁడగు ప్రతాపదేవుని కాలమందుఁ
బుట్టినప్రతాపరుద్రీయములోఁ గాకతీయులు సూర్యచంద్రవంశజులుగాని క్షత్రి
యు లని యున్నది. ఇట్లు వివిధముగా నేలయుండవలయును? కాకతీయులు క్షత్రి
యులే యైనచో మొదటినుండియు నామాట శాసనములలో నేల లేదు? గణ
పతిదేవునినాఁటి శాసనములు కొన్నింటిలోఁ గాకతీయులు సూర్యవంశపురాజు
లని యుండఁగాఁ బ్రతాపరుద్రీయములో సూర్యవంశపురాజులు కా రని యుండ
నేల? వీనిలో మన కేది ప్రమాణము?

సూర్యచంద్రవంశములకంటె వేఱయిన కొన్ని క్షత్రియవంశము లు
న్నట్లు పురాణములలోఁ జెప్పఁబడి యున్న ట్లంగీకరింతము. కాకతీయవంశము
పురాణోక్తము కాదు. పక్సియూష, కదంబ, పూషవాడాది వంశములతోపా
టి కాకతీయవంశముకూడ నూతనముగాఁ గని పెట్టఁబడిన మార్కండేయపురా
ణోత్తరభాగములో వర్ణింపఁబడినదేమో గాని ప్రసిద్ధపురాణములలో లేదు. ఆ
పురాణములలో వర్ణింపఁబడిన క్షత్రియవంశములలో నేవంశములో నీకాకతీయ
వంశ మంతర్భూతమో నీలాద్రిరాజుగారు చెప్పవలసియున్నది.

ఈకారణమువలన నావాదము నీలాద్రిరాజుగారిచే ఖండితము కాలేదని
సహృదయు లెఱుంగుదురుగాక.

చ. రామయ్య.

౧-వ యనుబంధము.

(అనుమకొండలో వేయికాళ్లమంటపము సమీపమందున్న శిలాస్తంభముమీఁదఁ
జెక్కఁబడిన శాసనము.)

యస్యోత్తుంగతరంగతాడితవియత్సప్తార్ణవీయం జలం । పాదాంగుష్ఠన
ఖాగ్రనఘ్నమభవ ద్భూమండలోద్ధారణే । దంష్ట్రాకోటికుటీరకోటరగతం త్రైలో
క్యమబ్బిందువ ద్బ్రహ్మాండా ఇవ రోమకందనికరో వందేవరాహం హరిం ॥ శ్రీహే
రంబ విలంబికుంతలమిల న్మల్లీవలత్కుట్మల వ్రాతోజ్జృంభిత(+)దలుబ్ధమధుప
ధ్వానోత్కరస్యాప్యవ । స్ఫీతశ్రీతమనా భవత్వమిహా మే ది(+)ం తిదం తద్యుతి
ప్రోద్దామోన్నల న్నైవిగ్రమలస ద్దంతాంతికాంత్యా శ్రియః॥ (+) తేవ దుగ్ధలహరీ

భీమదంచతీన దుగ్ధోదధే రమృతదీధితి నిర్మితేన । శ్రీఖండపిండపరిపాండురపుణ్య
కీర్తి నక్షత్రప సత్త్వవిరతంతు సరస్వతీనః ॥ భాగోత్పాదకకులశ్రియః పరివృఢశ్రౌతక్రి
యాకర్మఠః । శ్రీరామేశ్వరదీక్షితో జనయితా యస్యాక్షితా వగ్రణీః । సోభిం
తేంద్రసరోద్భవామృతయతే శ్రీపార్యయతి శ్రద్ధయా । శ్రీమద్రుద్ర · రేశ్వరస్య
సుమతే ర్వం శానలింపస్త్రయోః శ్రీమత్త్రిభువనమల్లో రాజా కాకత్యవంశసంభూతః ।
ప్రబలరిపువర్గనాశిప్రైషస్యవిధాయకాచార్యః ॥ శ్రీకాకత్యనరేంద్రతిలకో వైరీంద్ర
హృత్తాపకః సత్పాత్రేవసుదాయకః ప్రతిదినం కాంతామనోరంజకః దుష్టాం
చయదూషకః పురహర శ్రీపాదపద్మార్చకో నన్యగర్భ్యాతీకృతనాయకస్త్రిభువన
శ్రీమల్లదేవో బభౌ ॥ తత్పుత్త్రః శివపాదపద్మయుగళధ్యానామృతానందభూ ష్ఠిం
తాకో రిపుసుందరీజనమహాసౌభాగ్యసంపచ్ఛ్రియః । ప్రోల్‌రాజ ఇతిప్రసిద్ధి మ
గమ ద్వైరీంద్రదర్పాపహో నిశ్శంకప్రధనప్రకంపన మహాహంకార లంకేశ్వరః ॥

హస్త్యారోహణకర్కశం చాళుక్యచూడామణిం । శశ్వద్యుద్ధనిబద్ధ
గహ్వరమతిం యుద్ధేబబంధక్షణాత్ । శ్రీమత్తైలపదేవ మంబునిభస్తంభేరమ
స్థం క్షణాత్ । ప్రఖ్యాతో రిపుకంఠఖండన విధౌ భక్త్యాను రాగాజ్జహౌ ॥

మోకుంద ఉపతే రకుంఠపరశుస్త్రస్తా ప్రధానోల్లస ద్ధారాపాతనిపాతనైక
చతురం గోవిందరాజాహ్వయం । బద్ధ్వాన్యద్య తపోదయాక్షితిభృతే రాజ్యం
దదౌ లీలయా లుంఠాకో విషయస్య తస్య సమరే సర్వోదితాగురుః ॥

కృష్ణేర్ధ్వీనమంత్రకూటనగరీం నాథో యయో నిస్త్రపో గుండః ఖండిత
ఏవ ముండితశిరాః క్రోడాంకవక్షస్స్థలః । ఏనోడింభకనత్పెలాయమనరో జాతోగ
తః స్వాంపురీం ఆహూతోపి నృపేశ్వరస్య పురతః ప్రోలేనయుద్ధాయయత్ ॥

అస్యాచ్చానుమకొండనామనగరీం సంవేష్ట్యయోయుం స్థితో నానాము
ఒలికాస్వనో భువిజగద్దేవ స్సదేవప్రభుః । స్తబ్ధ స్తంభితపాకాగ్యకరణే శక్తః తు
రగాన్నిర్గతః శ్రీపతిప్రోలనృపస్య తస్య జయినః కింబ్రూమహే గౌరవమ్ ॥

దేవీ ముప్పమనామధేయమహితా యాంపార్యగుణా స్తారకాః కీర్తి శ్శారద
చంద్రికేవ విలసత్కాంతేస్తు వోపమా । కౌసల్యేవచ జానకీవచ సతీ కుంతీ
వద్దేవసా పౌలోమీవచ చండికేనచపరా తస్యాభవ ద్భామినీ॥

తస్యాం స్తస్య సుతోఽజనీహ పరమానందైకకందాంకురః కామః కిం
నలకూబరః శివసుతః స్కందో జయంతోథవా । జిష్ణుర్వజ్రధరోథవాహరిర
యం దస్రౌ కుమారౌ నతే భక్తః శ్రీగిరిశే హితాయ జగతః శ్రీరుద్రదేవో నృపః॥

కులగృహమమలిమ్నో జన్మభూమిం మహిమ్నః పదమతిమధురిమ్ణః ప్రేమధామప్రథిమ్నః । ప్రతినిధిముదధీనాం సంచయం తోయసృష్టే రకుల మకృత కేసర్యాఖ్యయా యస్తటాకం ॥

అథ చతురంబురాశిరశనాం భువమస్య సుతః త్రిభువనమల్లదేవ ఇతి భూమిపతిర్బ్బుభుజే । నిజభుజదర్పసంఘటనసముద్ధతకృత్తకర ప్రతిభటగండకంఠపరిమోటనచండభుజః ॥

అశిషదథ సమస్తాం తస్యపుత్రో ధరిత్రీ మశని రరినృపాణాం భూపతిః ప్రోలరాజః । ప్రతిసమరధరిత్రీ ప్రద్రవచ్ఛత్రుసేనా చరణబహులధూలీ పంకిలవ్యోమగంగః ॥

అథ భువమధిచక్రే తస్యపుత్రస్సమంతా త్కరదనృపతిచక్రశ్చక్రవాళాద్రివప్రాం । డమరసమరరంగత్స్వంగదశ్వీయ శశ్వద్ద్విహితమహితభూభృద్ద్వద్రవో రుద్రదేవః ॥

అథ నిజభుజక్షేత్రే తత్కనీయాన్ సశేషాం వసుధితధరణిమేనాం శ్రీమహాదేవరాజః । ప్రణతివిముఖమాసీ ద్యద్రణే కాందిశీకం గిరితటగృహసుధిత్స్వాపతీనాం కుటుంబం ॥

అమరతమరివాబ్ధే రత్రినేత్రాదివేందు ర్గగనఇవ ముకుందా ల్లోచనానందదాయీ । అథగణపతిదేవః శ్రీమహాదేవరాజాదజని భువనభూత్యై భూభుజాం చక్రవర్తీ ॥

శ్రీ రస్తు.

# తద్భవ దేశ్యస్వరూపము.

(ఇది నా యాంధ్రవ్యాకరణములోని తద్భవదేశ్య ప్రకరణముల సంగ్రహము.)

సంస్కృతప్రాకృతములవలనఁ బుట్టినపదములు తద్భవములు. అనఁగా "వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములను శాస్త్రప్రకారము పొంది వ్యవహరింపఁబడు శబ్దములు తద్భవము"లని లాక్షణికుల మతము. లాక్షణికులు కొంచె తద్భవలక్షణసంబద్ధములగు సిరి - వెన్నుఁడు - జాజి - చందమామ మొదలగు కొన్ని శబ్దముల నుదాహరించిరి గాని యెల్లవికృతిపదములకుఁ దగినప్రత్యేక నిఘంటువు లేదు. ఇటీవలఁ గేతనాప్పకవిసూరనాదుల సూచనల ననుసరించి శబ్దరత్నాకర నిఘంటుకర్త లగు శ్రీసీతారామాచార్యులుగారు మిక్కిలి శ్రమచేసి యెల్లతద్భవములు నొక్కచోఁ గూర్చి వైకృతదీపిక యనుపేర నొకకోశమును బ్రకటించిరి. సుమారు ౨౩౦౦ పదములను జూపుచున్న యిది భాషకు మహోపకారక మనుటకు సంశయము లేదు. కాని యందలి కొన్నిపదములుమాత్రము సంశయాస్పదములుగా నున్నవి. అట్టిపదములు రెండుమూఁడయిన నిపు డుదాహరింపఁబూనుట సందర్భమునుబట్టి తద్భవతత్త్వమును దెలుపుటకే కాని యాంధ్రలోకమునకు శబ్దరత్నాకరమును సమర్పించి దేశభాషకు మహోపకారము గావించిన శ్రీసీతారామాచార్యులవారి వైకృతదీపికను విమర్శించుటకుఁ గాదని ముందుగా వారిని కృతజ్ఞతాపూర్వకవందనములతో స్మరించుచుఁ దద్భవస్వరూపము నించుక తెలిపెదను.

తొల్లి యార్యులకుఁ బ్రాకృతము గృహభాష యగుటచేతను దేశమునఁ జాలకాల మది రాజకీయభాష యగుటచేతను దఱచుగా నందలిపదములు సమయసందర్భములనుబట్టి వాడుకలోఁ బ్రవేశించుట నైజము. మఱియు నార్యులకు సంస్కృత మభిమానభాష యగుటచేఁ దదభిజ్ఞులు మాటలాడు నపుడు సంస్కృతపదములు గొన్ని వాడుకలో దొరలుటయు సహజమే. అట్లుదొర్లి వచ్చి యీదేశ్యమునఁ జొచ్చిన యయ్యాపదము లప్పటిలోకుల నోళ్లలోఁ బడి యుచ్చారణవైషమ్యమునఁ బల్లటీలుగొట్టికొట్టి తుద కెట్లో కొన్నిమార్పులతో

స్థిరపడఁగా వ్రాసినే మనప్రాచీనులు తద్భవములనుగా వ్యవహరించిరని తెలిసికొ
నవచ్చును. అట్లు వాడుకలోనికి వచ్చిన యనార్యసంస్కృతప్రాకృతపదములు
వారివారికిఁ దటముగా నోటికి వచ్చినట్లైన యుండును గాని యమేదిన్యాదినిఘం
టువులలోనో మూలమూలల నుండెనట్లైన యుండె ననుటయు నాశబ్దము లప్పుడే
యర్థముల వాడఁబడుచుండెనో యాయర్థములతో వాని విస్పష్టస్వరూపము లంటి
యుండు ననుటయు యుక్తము గాని మాటము మూలానంతరనే యర్థముకూడ
మారు ననుట యంత యుక్తియుక్తము గాదు. మఱియు నేదయిన నొకవస్తువును
దెలిపెడుమాట వాడుకలో నొకటి లేక రెండుండును గాని నిఘంటువులలోని
దానిపర్యాయపదము లన్నియు నుండవుగదా? లోకములో నెండయినను నీ వే
రేమి? యని యడుగుటకు నీనామధేయ మే మని యడుగువారు గొందఱుం
దురు గాని యిప్పటిపరి సంజ్ఞ, అభిధానము, ఆఖ్య, అభిఖ్య, ఆహ్వయము మున్నగు
నామపర్యాయము లన్నియుఁ బ్రయోగించువా రుందురా? ఇట్టియవిగఁ గొన్ని
తద్భవములగతి యెట్లున్నదో చూతుఁడు.

సంస్కృతమున ఖుర శబ్దమొకటి గలదు. దీనికి శఫశ తురగ శంఖు దంత
గర్వము లర్థములఁట. దీనిని నామలింగానుశాసన కారుఁ డెఱుఁగఁడు. దీనినుండి
కోఱ గుణ్ణము పుట్టినవఁట దంతదంష్ట్రల కభేదము పాటించికొన్నను శఫశ
శంఖు గర్వార్థములను దెలుపు పదము లింకను దీనినుండి పుట్టలేదు. పై రెండు
పదములందును శకటరేఫ మున్నది. ఈశబ్దములను దద్భవము లనుట, "శకట
రేఫము తత్సమ తద్భవములందు లే" దనెడికొందఱు వైయాకరణులమతమును
నిరాకరించి గురురేఫము తద్భవములఁగూడఁ గల దనెడిస్వమతమును బలపఱుచు
కొనుట కుపయోగించునేమో కాని యీఖురశబ్దము గుణ్ణమును కోఱను దెలు
పుట కెప్పుడయిన వాడుకలోనికి వచ్చుట నైజ మగునేమో యాలోచింపుఁడు.
ఈయర్థముల వాడఁదగినవియు సర్వసామాన్యముగా సర్వత్ర యుపయోగింపఁ
బడుచున్నవియు నగు అశ్వతురంగాదులు దంతదంష్ట్రాదులు నగుపదము లనేకము
లుండఁగా, నేనానార్థరత్నమాలనో చంకఁబెట్టికొని పోయి గుణ్ణమును కోఱను
గూర్చి చెప్పవలసి వచ్చినపు డీయనేకార్థములను దెలుపు ఖురశబ్దమును బ్రయో
గించువాఁ డొకఁడేని యేకాలమున నుండు ననుట నమ్మఁదగి యుండునా? ఇది
గాక పెక్కువస్తువుల నొక్కటే పదము తెలుపుట వాడుకలో సహజమయినదా?
ఇఁక వాడుకలోని కీపదము రాకపోయినచో నానార్థకోశములను వెదకి ఖుర
శబ్దమును సంపాదించి దానినుండి గుణ్ణము కోఱను [illegible] తెనవో పనిలేక

పుట్టించి యుండు రనుట యుక్త మగునా? కావున దీనింబట్టి దేశ్యములయిన కోటి గుట్టములను దద్భవము లనుటకై వైకృతదీపిక ఖరుశబ్దమును సంపాదించినదో లేక యేయసురపదపారిజాతములోనో యిది వెలసినతరువాతనే యవి దేశమున నుదయించినవో యూహింపుడు. ఇక దీని నిట్లుంచి యింతకంటెను *వింతయయిన యింకొకదానిం జూతము.

కుంటశబ్దము త్రిలింగమైన గీర్వాణపదము. దీనికి నంటకుండ, జారజుఁడు, నిప్పులగుండము నని సుప్రసిద్ధము లయినయర్థములు గలవు. ఇంకను గొన్ని యర్థము లందందుఁ గలవు గాని యసురకోశము దీనిమొదటి రెండర్థములనే యెఱుఁగును. వైకృతదీపికలో దీనినుండి పుట్టినపదములు. కుండ - గుండము - గుండు - గుంట - గుంత - గుట్ట - కొండ - కుంట - అను నెనిమిది. పైసంస్కృతపదము రూపాంతరమయిన కుండికాశబ్దమువలన గుండిగ పుట్టి యుండేయున్నది. ఇట్టి యెడఁ దద్భవము ప్రకృత్యర్థముకంటె భిన్నార్థమును గూడఁ దెల్పునని మహారాజసూత్త్రసూత్త్రాధారముగా నున్నవు చెల్లువిధములఁ బైవానిం బోలిన గండ - గండి - గిండి - గుండె - గొండి - గంటు - గట్టి - గట్టు - గిట్ట - కుంటెన - కొండిక - మున్నగు వానింగూడ దీనినుండి పుట్టినట్లుగానే నిరూపించినచో వీనికై యితర ప్రకృతులను వెదకెడి యావశ్యకతయు లేకపోవును. తద్భవధారము నొకతట్టు కుండశబ్దమే యాఁపియుండును గాని యివిమాత్రము దీనినుండి తప్పి వేఱుచోట్లఁ బుట్టినవి. చూచితిరా! ఇన్నియర్థముల నొక్కకుండపదము వాడఁబడె ననుట కంటె వింత వేఱుండునా? ఇట్లల్పమయిన యక్షరసామ్యమునే యాఁతగాఁ గొని తద్భవ మర్థాంతరమును దెల్పు ననెడిసూత్త్రమునే చేతఁగొన్నచో నాంధ్రదేశ్యపదము లన్నియుఁ దద్భవము లగుటయే కాదు లోకములోని సకలభాషాపదములు సంస్కృతభవము లనుట కాటంక ముండునా? ఇట్లే వైకృతదీపికలోని సంస్కృత తద్భవపదములను బరిశీలించినచో దాదాపుగా నాలుగైదువందల దేశ్యపదము లయినఁ దద్భవములుగా మాఱినట్లు కనఁబడకపోవు. ఆపదము లన్నియు శబ్దరత్నాకరమునఁ గూడ వైకృతములుగానే నిరూపింపఁబడియున్నవి. కావునఁ దద్భవవివక్షయందు వ్యవహారయోగ్యత, అక్షరసామ్యము, అర్థసంబంధమును బ్రధానము లగు నని తలంపవలయును గాని తోఁకను జూచినంతనే పులి యనునట్లుగా నయినదియుఁ గానిదియుఁ దద్భవ మని తలంపరాదు. ప్రకృత్యర్థమునకు నాలుగామడ దూరమున నున్నవియు శకటరేఫము గలవియు సర్వజనసామాన్యముగా వ్యవహారమున నుండక సుప్రసిద్ధసంస్కృతభాషాగ్రంథము

లఁ గూడ లేక యేనిఘంటువులలోనో మాఱుమూలలనుండు పదములతో నించుక యర్థవర్ణసామ్య ముండియు నుండనట్లుగాఁ గనఁబడునవియు నగు తెలుఁగుపదములు తద్భవము లని భ్రాంతిపడరాదు. ఇట్లు చెప్పుటచే నన్నియు దేశ్యములే యనవచ్చు నని యాక్షేపింపరాదు. పైప్రసంగము ననుసరించి య్యుక్తియుక్తములై నిర్బాధకములై కనఁబడు కొమరుఁడు, పయనము, గోనము, దేవళము, చక్కెర, రాతిరి, కన్నియ మున్నగువాని నెవరు తద్భవము లనరు? వైకృతదీపికలోని అంతః = అందము, భీతః = బీద, భరః = పరువు, ఉరః = ఱొమ్ము, కుండలం = గుండ్రము, మొదలుగాఁ గలవాని నెవరు తద్భవము లని నమ్ముదురు. ఇందు లోపల ననెడియర్థమిచ్చు "అంతర్" అనెడి రేఫాంతావ్యయమునుండి కాని, నాశము, తుద, కడపటిది యనునర్థము లిచ్చు 'అంత' శబ్దమునుండి కాని 'అందము' పుట్టె ననుట హాస్యాస్పదము గదా? ఇఁక నమరసింహుఁడు గూడ నెఱుఁగని సౌందర్యార్థకమయినయంతశబ్దమెందయినఁ గలదేమోయనుకొందము. అది యంద మను నర్థమున వాడుకకు రాఁదగి యున్నదా? కానిచో దీని కంద మనువికృతరూప మెట్లువచ్చును? ఇఁక దక్కినవాని యౌచిత్యమును బాఠకులే విమర్శింతురుగాక.

ఇపుడు స్వార్థమును విడిచి వాణిజ్య మనెడియర్థమున వర్తకశబ్దము మెల్లగా వాడుకలోఁ బ్రవేశించి యిప్పటిగ్రంథములఁ బ్రాఁకుచుండలేదా? అక్షయశబ్దార్థమును విడిచి "అక్కజము" పూర్వగ్రంథముల నాశ్చర్యార్థములఁ బ్రయోగింపఁబడలేదా? కావునఁ దద్భవ మర్థాంతరద్యోతకముగాఁ గూడ దనునియమ మెక్కడిది యని యాక్షేపము రావచ్చును. సత్యమే. వర్తకము వంటి తత్సమపదము లిట్లు ప్రవేశించుట యెంతవఱ కర్హమో ప్రాజ్ఞలోకమే నిర్ణయించుకొనుఁగాక. ఇఁకనో యర్థాంతరబోధము లయినతద్భవములు గొన్ని భాషలో లేవనుటకై యీప్రసంగ మెత్తినది గాదు. అట్టిపదములును గావ్యంబుల లెక్క కెన్నో గానరావు. ఒకవేళఁ బెక్కు లున్నవని యంగీకరింపఁ దగియున్నను నవి పేద, కత్తె మున్నగువానివలెఁ బ్రకృతిభావమునకుఁ గూడ దూరముగా నున్నట్లు గానరావు. మతుబర్థమున వచ్చు కత్తెయను ప్రత్యయము కర్త్రీశబ్దమునుండి పుట్టిన దని నమ్మువారికిఁ జెప్పఁజాలను గాని ప్రకృతికి శుద్ధవిపరీతములు విస్మయజనకములు నగునట్టి తద్భవములందు విశేషించి కానరావు. అట్లున్నచో నట్టివి తద్భవములు గావనియే చెప్పవచ్చును. కావునఁ దద్భవము ప్రకృత్యర్థమున కించుక యెడముగాఁ గూడ నుండు ననుటకుఁ బ్రయోగములు

గొన్ని లభించినంతమాత్రమున నయినవానిని గానివానిని గూడఁ దద్భవము లనరా దనుటకే యింత చెప్పవలసివచ్చినది గాని మన బాసకు మే లొనగూర్చిన తద్భవములను దేశ్యములని సాధించుటకై కా దని యూహింపఁదగును. మఱి యుఁ బూర్వలక్షణకర్తలే యీతద్భవదేశ్యనిర్ణయమునఁ బొరపడి యున్నా రను టకుఁ గూడ నొకనిదర్శన మరయుఁడు. మంచెల్ల వాసుదేవకవి తనవైకృతఛం ద్రికలోఁ బైశాచీభవములను జూపుచు నందు నెలవు, పైరు, శబ్దములను గూడఁ జేర్చెను. ఇవి శబ్దరత్నాకరమున దేశ్యములుగా నున్నవి. ఇట్లే కేతన, అప్పకవి మున్నగువారు గూడఁ దద్భవములుగా నిరూపించిన వానిని మఱికొం దఱు దేశ్యము లనుటయు వారు దేశ్యము లన్నవానిని మఱికొందఱు తద్భ వము లనుటయుఁ గూడఁ గలదు. కావునఁ బ్రకృత్యర్థాదులను మున్ను చెప్పి నట్లుగాఁ జక్కఁగాఁ బరిశీలించి తద్భవనిర్ణయము సేయుట యుచిత మని నా యభిప్రాయము.

ఇఁక దేశ్యస్వరూపమునుగూర్చి మిక్కిలి విపులముగా వ్రాయఁబడి యు న్నది గాని వ్యవధి చాలకపోవుటచే నాప్రకరణము కడపటిమాటలను మాత్ర మిపుడు విన్నవించుచున్నాను.

దేశ్యమునుగూర్చి తనవికృతివివేకమున నథర్వణాచార్యుఁ డిట్లు ప్రశం సించియున్నాఁడు:—

"భాషేయ మమితా దేశ్యా తత్ర చిత్రస్వభావయుక్
తచ్చిత్రతాతు ద్రష్టవ్యా పూజ్యపాదసుభాషితే."

ఈసుభాషితము దేశ్యనీతికావ్యమైనను లేక లక్షణగ్రంథమైనను నంచు మనోహరమయిన దేశ్యప్రసంగ ముండుననుట కనుమానము లేదు. అయిన నేమి? సుభాషితమున దేశ్యచిత్రత చూడుఁ డనెడి యథర్వణుని యుపదేశ మునఁ గూడ మన కిపుడు చందమామఘుటికయే నిజమైనది. కాని యతఁడు భాషనుండి వేఱుచేసి దేశ్యము నిట్లు పొగడుటచే నిది తప్పక కావ్యరచనకుఁ గూడఁ దగినంతటిదై యుండు ననెడియభిప్రాయము మాత్రము సిద్ధపడకపోదు.

ఇట్టిదేశ్యమునఁ గొంచె మెచ్చుగా మూఁడువేలపదము లుండు నని యిప్పటి శబ్దరత్నాకరాదులవలనఁ దెలియఁగలదు. అంతరించిన వెన్నుండునో యూహింపఁజాలము. మన్ను, మట్టి, పొలము, మేఁక, పిల్ల, గొఱ్ఱె, కాకి, కుక్క, గుపదములు తద్భవము లనియే మనము విశ్వసించినచో సర్వజనవ్యవ

నట్లే కదా? ఇంత యేల? మానవజాతిసామాన్యవాచకపదము దేశ్యమునఁ గానరాదు, మానిసి యనెడితద్భవమే యిందులకు గతియయినది. దీనిచే నైన దేశ్యములు గొన్ని యడుగంటిన వని తెలియకపోవునా? ఇందుల కొకయుదాహరణ మరయుఁడు. అప్పు-నీరు - ఇవితద్భవము లనియే యొప్పికొందము. ఇందు మొదటిది దేశమంతట నాబాలగోపాలము వాడుకలో నున్నను దేశ్యమయిన తల్లిగూడ మిగిలియున్నది. కాని నీటిని దెల్పు దేశ్యపద మేది; అపుడు వారు చూడనివానికిఁ బేరెట్లు వచ్చు ననుకొంద మన్నను నీరు చూడని ప్రాచీనదేశీయు లుండిరా? అగ్గినిప్పు మొదలగువానిలో, అగ్గిని నిప్పు, బట్టను గుడ్డ, కడవను ముంత, యంటికొని వచ్చినట్లుగా నీటితోఁ గొట్టికొని వచ్చిన దేశ్యపదమే కానరాదు. దీనింబట్టి చూడఁగాఁ దద్భవములు దేశమున నలమికొను కాలమున నార్యులవలెనే యింపలి పాఁతకాఁపులును వానినే వాడుచు వచ్చుటంజేసి కొన్నిదేశ్యములు మెల్లమెల్లగా జాఱియుండు నని తోఁపకమానదు. కావున లోకవ్యవహారమున కత్యంతావశ్యకము లయిన విషయములలో నెందెందుఁ దద్భవపదము మాత్రమే కనఁబడుచున్నదో యందందు మున్నున్న దేశ్యపదము లోపించియుండునని యూహించుటకు ముందుగా నది తద్భవ మగునా కాదా యని విమర్శించుట మాత్ర మత్యావశ్యకము.

ఇది యిట్లుండ దేశ్యములో నన్యదేశ్యములు గొన్ని కలిసి యున్నవని యర్వాచీనలక్షణములవలనఁ దెలియుచున్నది. అందు కావు కవరలవంటి యనాంధ్రవర్ణయుక్తములు సుమారు, సెబాసు మున్నగు నాంధ్రవర్ణయుక్తములును స్పష్టములే కాన వాని చర్చతోఁ బనిలేదు. ఇఁకఁ దావి మోవిఁ బోలిన యాంధ్రవర్ణయుక్తములను గుఱించి ప్రశంసింపవలసియున్నది. వాగనుశాసనాదు లన్యదేశ్యప్రశంస చేసినట్లు కానరాదు, గాని, వారితరువాతివారు వేని నన్యదేశ్యములనుగాఁ బరిగణించిరో యవి భారతములోఁ గనఁబడుచునే యున్నవి. కావున నట్టివి భారతరచనకుఁ బూర్వమే భాషలోఁ జేరిన వనుట నిక్కము. కాని యన్యదేశ్యము లనఁగా నేమో యాలోచింతము. కేతనకవి,

ఆ. తత్సమంబు నాఁగఁ దద్భవంబన నచ్చ, తెలుఁగు నాఁగ దేశి తెనుఁగు నాఁగ
　గ్రామ్యభాష నాఁగఁ గల వైదు తెలుఁగులు, వేఱువేఱ వాని విస్తరింతు.

అని ప్రతిన సలిపి యచ్చ తెలుఁగు దేశి తెనుఁగు భేదమున దేశ్యమును విభజించి యెల్లరకుఁ దెలియుపలుకు లచ్చతెలుఁగు లనియుఁ గొందఱకు మాత్రము తెలియు తెఱఁగుఁ బలుకులు దేశితెలుఁగు లనియు నిర్వచించి దేశితెలుఁగు

నకు నూఱుపదము లుదాహరించియున్నాఁడు. అప్పకవియును గేతనయభిప్రా
యమున కనుగుణముగానే దేశ్యమును ద్వివిధముగా విభజించి

గీ. ఆంధ్రదేశపురస్థాన్యయు లైనసకల, జనములకును మఱుంగు లేశంబు లేక
తేటతెల్లమిగాఁబల్కు మాటలెల్ల, నవనిశుద్ధాంధ్రదేశ్యంబులనఁగఁబరఁగు.

క. కేశవ! యాంధ్రులు నానా, దేశంబులయందు నిలిచి తెలుఁగులె తత్త
ద్దేశోక్తులంటఁ బలికిన, నాశబ్దము లన్యదేశజాంధ్రము లయ్యెన్.

అనుచుఁ దద్భేదంబులకు లక్షణములు వ్రాసి రెండవజాతివానికి రమారమి యఱువదిపదము లుదాహరించెను. ఇం దీతనిరెండులక్షణములను వానియుదాహరణములను బరిశీలించినచోఁ గేతనాప్పకవు లేకాభిప్రాయు లైనట్లు స్పష్టపడఁగలదు. ఇందులకు వీరిరువురు నుదాహరించిన వెలఁది, తొయ్యలి, చెలి, బోటి, కౌను, వెన్ను, తావి, మోవి. మొదలగుపదముల యేకీభావమే ప్రమాణము. దీనివలన నాంధ్రవర్ణయుక్తము లయినయన్యదేశ్యము లనఁగా నితరభాషలనుండి యిందుఁ గలిసినపదములు గావనియు, వీరుచెప్పినట్లుగా నితరదేశములఁ గొంతకాలము నివసించి యిందరుదెంచినతెలుఁగువారి తెలుఁగుమాటలనియు నవియే యిందలివారికిఁ గ్రొత్తవియై కొందఱకు మాత్రమే తెలిసెడి తెఱఁగుఁ బలుకులైన దేశితెలుఁగు లనియు గ్రహింపనగును. అన్యదేశ్యతత్త్వమిట్టిదగుటయే వాగనుశాసనాదులు దీని ప్రశంస యెత్తకపోవుటకుఁ గారణమయినది. ఇట్లాంధ్రదేశ్యములో నన్యదేశ్య మంతర్భూత మయినదే కాని వేఱుగా దని తెలిసికొన్నను మన మింతటితో నీప్రసంగము దాఁటలేదు. ఏమనఁగా? పైని జెప్పినట్లుగాఁ గేతనకవి చూపిన దేశితెలుఁగులోని ఉవిద, వేనలి, నాన మున్నగువానిని, అప్పకవి చూపిన యన్యదేశ్యాంధ్రములలోని బనరము, దురము, వేసవి మున్నగువానిని మనవైకృతదీపికా శబ్దరత్నాకరములు తద్భవములనుగాఁ జూపుచున్నవి. మరలఁ జూచితిరా? తద్భవమహత్త్వమెంతవఱకుఁ బోయినదో? ఇవి దేశ్యము లని వారిమాట నమ్మఁదగునో తద్భవములని వీరిమాట నమ్మఁదగునో విద్వల్లోకమే నిర్ణయించికొనుఁగాక. కావునఁ బరిశీలింపక వర్ణాక్షరసామ్యమాత్రమున నయినవానిని గానివానిని గూడఁ దద్భవము లనరా దనియు, నాంధ్రవర్ణయుక్తము లని లాక్షణికులు చూపిన వన్నియు నన్యదేశభాషలలోనివిగాక యితరదేశములనుండి వచ్చిన యాంధ్రుల తెలుఁగుపలుకు లే యనియు విశ్వసింపఁ దగు నని నాయభిప్రాయము.

తక్కువగా నగము తద్భవముల క్రిందను దక్కినది యన్యదేశ్యముల క్రిందను బోఁగాఁ ద్రిలింగదేశ్యము మొదటికే మోసము వచ్చునుగదా?

కావున నోభాషాభిమానులారా! వ్రాల తేలికయు వీనులవిందగు నుడికారమును దేనెలొలుకు పలుకుబడియు గలిగి, యెల్లదేశభాషలందు లెస్స యనిపించుకొనునట్లుగా నెల్లసుగుణసంపదయందును దేవవాణి నోటినుండి యూడిపడినట్లుగాఁ దత్సమ తద్భవముల సాహాయ్యమును గాంచి యేడవశతాబ్దినాఁటికే గ్రాంథికస్థితికి వచ్చినట్లుగాఁ గానవచ్చుచున్న మనత్రిలింగదేశభాష యొక స్వతంత్రభాష యనియుఁ గాలకర్మవశమునఁ గొంతకాల మడఁగంటియుఁ బిదప సంస్కృతప్రాకృతభాషల చెలిమిచేఁ గౌరవస్థితికి వచ్చిన దనియు, నీసత్యము నాధారముగాఁ జేసికొని యేదో యినుమంత పోలికయున్నను లేకున్నను గూడ నిందలిపదముల నెల్లఁ దద్భవములను గాఁ బరిగణించుట యుచితముగా దనియుఁ, దద్భవములను నన్యదేశ్యములను నిర్ణయించుపట్టునఁ బరస్పరవిరుద్ధములుగా నున్నపూర్వలాక్షణికుల వ్రాఁతలనే కేవలము విశ్వసింపక యర్థసందర్భాదులఁ బరిశీలింపవలయు ననియు మనవిచేయుచున్నాఁడను.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

---

శ్రీరస్తు.

# నెల్లూరఁ బత్రికాప్రచారము.

౧. "నెల్లూర్ పైయోనియర్" (Nellore Pioneer) అనునది పత్రికా ప్రపంచమున నెల్లూర వెలసిన ప్రథమపత్రికాపుత్రికగఁ గన్పట్టుచున్నది. ఇయ్యది గతశతాబ్దపు టరువదియవదశకాంతమున నంబెరుమాళ్లయ్య దంపూరి నరసయ్య యనునిద్దఱాంగ్లేయభాషాసాహితీధురీణులచే నింగ్లీషునఁ బ్రవర్తింపఁ బడుచుండినది. ఈప్రవర్తకు లిద్దఱును, కలెక్టరుకచ్చేరి యుద్యోగులైనను నాఁటికాలపు సర్కారుకట్టుదిట్టములలో నీకాలపు చట్టముల సరళి లేనందున వారిద్దఱు నాపత్రిక సాగింపఁజాలిరి. ఈపత్రికావిజయ మేపాటిగనుండెనో నిర్ణయింపఁ దగుసాధనసంపత్తి లుప్తమయినది. ఆకాలమునను నెల్లూరుమహాజను లీయుద్యమమున కపేక్షిత మగునాదరాభిమానములఁ జూపనందున సంవత్సరావధిలో నయ్యది నశించె నని యప్పత్రికావ్యాపారమును సాక్షాత్తుగ నెఱిఁగినమాన్యులొకరు చెప్పిరి. దీనిప్రతి యొక్కటైన లభింపలేదు.

ప్రవర్తకవ్యూహములోని నంబెరుమాళ్లయ్య సబుమేజస్ట్రీటుపదవి నంది యుండె నఁట. దంపూరి నరసయ్యయన్ననో, యీయనకు వార్తాపత్రికాప్రచార ముగ్గుపాలతో నలవడినటులున్నది. నెల్లూరు పయొనియ రుదయించుకాలమున వీరు నెల్లూరు కలెక్టరాఫీసులో ట్రాన్సులేటరుగ నుండిరఁట. వీరు పుట్టి పెరిఁగినది మద్రాసు. చిన్నతనమున మద్రాసులో నుండఁగ "నేటివు అడ్వొకేటు" (Native Advocate) అను నాంగ్లేయపత్రికను సాగించుచుండిరి. అద్దాని జాలించి కీర్తిశేషులగు శ్రీవేంకటగిరిమహారాజా రాజగోపాలకృష్ణయాచేంద్రుల వారికి ఇంగ్లీషు ఉపాధ్యాయులుగ వెంకటగిరి చేరిరి. అచటఁ గొంతకాల ముండినపిదప నప్పటికలెక్టరుగారు వీరివిద్యాకుశలతకు మెచ్చి వీరిని కలెక్టరు ఆఫీసులో (ట్రాన్సులేటరు) ద్విభాషిగఁ జేర్చికొనిరి. అటనుండి స్కూళ్ల డిప్యూటి ఇన్స్పెక్టరుగఁ బోయిరి. అదియు నస్థిరమై తిరుగఁ జెన్నపట్టణముఁ జేరి ౧౮౮౧ ప్రాంతములఁ "పీపిల్సుఫ్రెండు" అను లోకహితకర మగునింగ్లీషువారపత్రిక

కాలక్రమగతముగ స్థళాంతరమున మఱియొకవార్తాపత్రిక నంటి వీరిప్రశంస తిరుగఁ జేయఁబడును.

౨. నెల్లూరు పైయోనియరు, అంతరించినపిదప రివిన్యూసంబంధ మగు నెవ్వియో కొన్ని ప్రకటనల నెల్లూరి రివిన్యూ ఉద్యోగు లెవరో సాగించుచుండి రని వదంతి గలదు గాని యద్దాని నిశ్చయింప నలవిగా కున్నది.

౩. విద్యార్థికల్పభూజము:—౧౮౮౨-౮౩ ప్రాంతములలో ఉల్లిగొండము రామచంద్రరా వనునాంగ్ల పండితు లొకరు "విద్యార్థికల్పభూజ" మనునన్వర్థ నామ మగు తెనుఁగుపత్రికను బ్రకటించుచుండిరి. వీరును నెల్లూరికలెక్టరాఫీసులో నుద్యోగులుగ నుండిరి. రాజకీయోద్యోగలక్ష్మి, పాండిత్యప్రౌఢిమ, వైదుష్య నైపుణ్యము, యౌగపద్యమున వీరి నాశ్రయించి యుండె. వీరు పద్యములఁ జమ్పుసరళి యతిమనోహరముగ నుండెను. పాఠకోత్తమలక్షణము లెవ్వి గలవో యవి యన్నియు వీరియందు స్ఫుటములయి యుండెను. ఈకల్పభూజ మాంధ్ర భాషాసంజీవిని కేన యగును. శైలి సొంపుగనుండును. గతి ప్రౌఢముగనుండును. వీరు వాదకుశలురు. ఈకల్పభూజమును పెన్నేటిగడ్డన చిరజీవి కాఁజాలక పోయెను.

౪. అముద్రితగ్రంథచింతామణి:—కల్పభూజము పునరావృత్తిరహితపదవిఁ జెందినపిదప ౧౮౮౪-౮౫ ప్రాంతములలో శ్రీరామచంద్రరావుగారియభిమతులగుపూండ్ల రామకృష్ణయ్య చింతామణినా నొప్పునముద్రితగ్రంథచింతామణిం దెలుఁగుప్రపంచమున నవతరింపఁ జేసిరి. రామకృష్ణయ్య కేవలము స్వయంకృషిచే నాంధ్రమున నిరూఢమగు సాహిత్యమును గడించెను. జన్మచేఁ గొలఁదిగ నత్తివాఁడైనను బుస్తకముఁ జదువునపుడు నిరంకుశధారగఁ బఠించును.

ఈపత్రిక యెన్నఁడును లోకమునంతయు నావరింపవలయు ననుడంబవృత్తి కెగయక యణఁకువ గలదియై కొలఁదిపాటి పరిధిలో నిమిడియుండి యద్భుతచర్యఁ జూపినది. "ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయవిలాస" మనునుత్తమ లక్ష్యలక్షణనిధి యీపత్రికాముఖమున వెడలినది. ఇంకను హరిశ్చంద్ర నలోపాఖ్యానము లోనగు ననేకప్రౌఢకావ్యముల నీచిన్నిపత్రిక క్రిమిదష్టమై నిర్నామముఁ గాకుండ రక్షించి లోకమున కర్పించినది; లోకము నర్చించిన దనిననుఁ జెల్లును.

మహాపండితులును గవులునగు మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారును మహోపాధ్యాయ శ్రీ వేదము వేంకటరాయశాస్త్రికవిపండితులు నీపత్రికోప

విశేఖకులుగ నుండి భాషావిషయముల నీపత్రి కా "మయూఖములఁ" జర్పించు చుండిరి. శ్రీ వేంకటరాయశాస్త్రులవారి యాంధ్రకీర్తి కీపత్రిక యొకముఖ్యకార ణము. కీర్తిశేషులగు శ్రీ వెంకటగిరిమహారాజా శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్ర బహాదరువారి కీపత్రికయందును దత్ప్రవర్తకునియందును నత్యంతాభిమానము గలిగియుండెను. రామకృష్ణయ్యగారు చరమస్థితిలో స్మృతిదప్పి యుండినటులు విని యపుడును శ్రీవారు కొంత ద్రవ్యసహాయముఁ జేసి "శ్రీ వెంకటగిరిరాజా గారుపంపినా" రని దిక్కులు పిక్కటిల్లునట్లు ముమూర్షువునకుఁగూడ శ్రవణ గోచర మగునట్లు పెద్దధ్వనితో వారిచెవిలోఁ జెప్పు మని యాజ్ఞ చేసిరి. ఈ యు. గ్ర. చింతామణి యిరువదివత్సరము లాంధ్రసరస్వతి నుద్ధరించి తదధిపతి నిర్యాణమున దానును గీర్తమూర్తిం జెందినది.

ఈపత్రికాప్రతులును దత్పారస్పరముగఁ బ్రకటితములగు గ్రంథములును నిపుడును లభింపఁగలవు.

తిక్కన విఖ్యాతి కాకరమగు నెల్లూర వెలసిన యీచింతామణి ననుక రించియే కాఁబోలు నన్నయనంటిన రాజమహేంద్రమును "చింతామణి" నొకదానిఁ గొంతకాలము వెలిపుచ్చినది.

౫. వార్తాదర్శిని:—రామకృష్ణచింతామణి వైదుష్యము నీనుచుండ నర్థా నర్థపరిజ్ఞానాదర్శ మగువార్తాదర్శిని యనువారపత్రిక ౧౮౯౩ ప్రాంతములఁ బొడసూపెను. ప్రథమప్రవర్తకుఁ డగు తూములూరు వెంకటరమణయ్య దీని నాతిస్ఫూర్తి విజృంభితముగ నడపుచుండెను. అతఁడు ప్లీడరు పదమునంది గూడూరుఁ జేరిన వెనుక ప్రవర్తకత్వము చేఁబూనిన నేలటూరు కృష్ణమాచా ర్యుల యాజమాన్యమున నిది యుచ్చదశకు వచ్చినది. తుదకు నిజమన నిష్ఠు రము ప్రాపించి వార్తాదర్శిని ౧౮౯౬ రున న్నార్తిం జెందె. జీవద్దశలో జానపద మున కత్యంతహితముఁ జేయుచుండె.

౬. వర్తమానతరంగిణి, న్యాయబోధిని:—కొంచె మించుమించుగ వార్తా దర్శిని తోడి సమకాలీనముగ బుచ్చిరెడ్డిపాళెములో వర్తమానతరంగిణియు వంగవోలునందు న్యాయబోధినియు బయలువెడలినవి.

విద్యావినోది యగు బెజవాడ పట్టాభిరామరెడ్డి యాజమాన్యముక్రిందఁ దరంగిణి యుప్పొంగినది. ఆంధ్రాంగ్లభాషలఁ దేటిన బెజవాడ బాలకృష్ణారెడ్డి పత్రికాధ్యక్షుఁడు. సంస్కృతాంధ్రవిదు లగుకుందూరు వరదాచార్యులు యడ

ఇట్లు సన్నివేశములతో సంపన్న మయ్యును నాపత్రిక ౧౮౯౮ లోఁ బ్రారంభ మయి ౧౮౯౯ నతిక్రమించి జీవింపలేకపోయెను. రెడ్లును బారులును గలసి యుద్యమించిన యీపత్రిక యిదానీంతన బ్రాహ్మణ బ్రాహ్మణేతరవ్యవస్థా సామ రస్యమున కొకయాధారముగఁ జేసికొననగును.

౭. శారద:—తరంగిణీప్రశమనమున బుచ్చిరెడ్డిపాళెమున నే దొడ్ల వేంకట రామరెడ్డి యాజమాన్యమున శరచ్చంద్రప్రభతో "శారద" యంకురించెను. అభిమానము చాలమినో యభినివేశము శ్లథమగుటనో 'శారద' యచిర కాలమున నస్తమించె.

తరంగిణీశారదల నుపక్రమింపఁగలిగిన వైదుష్యదార్ఢ్యోపేతులగు బ్రాహ్మ ణేతరులచే నలంకృతమై యుండిన రెడ్డిమండల మిప్పు డెట్లున్నది?

౮. న్యాయబోధిని:—వర్తమానతరంగిణితో వంగవోలున నుదయించిన న్యాయబోధినియుఁ బ్రశంసింపఁబడియె. ఇయ్యది వ్యవహారాత్మకమై విలసిల్లెను. ఆపత్రికాప్రవర్తకు లగుకోపల్లి వేంకటరమణరా వాంధ్రలోకమున కపరిచితులు గారు. న్యాయబోధిని ౧౮౯౩-౯౪ సంవత్సరములలో నుండినటులు దెలియు చున్నది.

మందారమంజరి:—దీని యనుంగుకూన "మందారమంజరి". ఇయ్యదియు వంగోలునందు యుదాహృత వేంకటరమణరావుగారిచేఁ బ్రవర్తితమగుచుఁ బసి తనముననే క్షీణించిపోయినది.

నెల్లూరఁ బత్రికాప్రచార మనుచో వంగవోలు పత్రికల కేటియవకాశ మనునాశంక పొడమఁ గలదు. ఆకాలమున వంగవోలు నెల్లూరునకు యౌవ రాజ్యస్థానమునఁ బ్రకాశించుచు నుత్తమాశయముల నెల్లూరినుండి కొనుచుం డెను. నెల్లూరును వంగవోలును నాకాలమున బింబప్రతిబింబన్యాయమున నుండినవి. అట్లు వంగవోలు మాతృపార్శ్వమునుండి బలాదాకృష్యమాణమై భ్రంశక్లేశమునఁ గుంది యెట్టకేలకు వైరాగ్య మవలంబించి సమానప్రతిపత్తి నుండిన గుంటూరితో సాపత్న్యమనుభవించుచున్నది. భావస్థిర మగుజననాం తర సౌహృదముంబలె నెల్లూరు వంగవోలును మఱవనొల్లదు.

౯. రోమన్ కాథోలికుపేపరు:—"వార్తాదర్శిని" సమకాలీనముగ నెల్లూరి రోమన్ కాథోలికు మిషనువా రొకవారపత్రికను దెలుఁగునఁ బ్రచురించుచుం డిరి. ఇందు ముఖ్యముగ మతవిషయములును వినోదవిషయములు నుండెను. దీనినామరూపములు మృగ్యములయినవి.

౧౦. వాగ్వల్లి - భారతి:—శతాబ్దసంధియందు నెల్లూర "వాగ్వల్లి" యు "భారతి" యు నాత్మకూరు తాలూకా కలువాయినుండి "యానందదాయిని" యు విద్యాప్రపంచము నలంకరించినవి.

వాగ్వల్లి ౧౮౯౯ సం॥ జనవరియందు కొమాండూరు వేంకటరామానుజశర్మప్రభువునఁ బ్రారంభింపఁబడి ౧౯౦౨ లోఁ గొంతవఱకు జరగి పాఠకపోషణచాలక నిలిచినది.

చెన్నపట్టణమునఁ బ్రకాశించుచుండిన "శశిలేఖ" వాగ్వల్లియంకురమున కవకాశ మిచ్చె. శశిలేఖావాగ్వల్లుల సాహచర్యమొల్లని "సూర్యాలోక" మొండు చెన్నపట్టణమున బయలువెడలె. సూరి + ఆలోకము, సూర్య + ఆలోకమని దీని విగ్రహ మనేకవిధములుగఁ జేయఁబడుచుండెను. "సూర్యాలోకము" న "శశిలేఖ" నిస్తేజస్కము కాఁగల దని యొకయుద్దేశము. సూర్యాలోకభీషణమున "వాగ్వల్లి" వాడి శుష్కించి నశించు ననియు మఱియొక యుద్దేశమని తజ్ఞులు చెప్పుకొనుచుండిరి. సూర్యాలోకోద్దేశ మేపాటి నెఱవేఱినదియు నిర్ణయింప నలవిగాదు.

ఆనందదాయిని ౧౮౯౯ సం॥ జనవరిలోఁ బ్రారంభమయి యాసంవత్సరాంతములోపల నంతమొందినది. ప్రకృతకాలమునఁ గడపలోఁ బండితులుగ నుండు జనమంచి శేషాద్రిశర్మ దీనికిఁ బ్రవర్తకులుగను పాటూరు వీరంరాజుగారు మేనేజరుగను నుండిరి.

౧౯౦౦ సం॥ జనవరిలో నాంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరాయకవీంద్రులు "భారతి" ని నెలకొల్పి కార్యాంతరాసక్తులయి ౧౯౦౧ సం॥ జనవరిలో విరమించిరి.

వాగ్వల్లి - ఆనందదాయిని - భారతీ పత్రికలు విద్యాప్రచారమున విలసిల్లినవి.

౧౧. ఆంధ్రభాషాగ్రామవర్తమాని:—నెల్లూరఁ బత్రికాప్రచారప్రథమాచార్యు లగుదంపూరు నరసయ్య ౧౮౯౭-౯౮ ప్రాంతములఁ జెన్నపట్టణము నుండి నెల్లూరికిఁ దిరుగ వచ్చి యిచ్చట స్థావరము కుదిర్చికొని ౧౯౦౦ సంవత్సరమున "ఆంధ్రభాషాగ్రామవర్తమాని" యను నొకచిన్న తెలుఁగు వార్తాపత్రికను బ్రారంభించిరి. ఇది ముఖ్యముగఁ బల్లెటూళ్లకును నచ్చటి జనమునకు నుద్దేశింపఁబడినది. పల్లెటూళ్లరైతు లనేకులు తమకష్టముల నీ పత్రికాముఖమునఁ దెలుపుకొనుచుండిరి. పాఠకాదరము చాలమిని బ్రవర్తకుని

వార్ధక్యమువలనను నియ్యదియు శైశవముననే యంతరించినది. జీవించియుండిన కొలందికాలమున జనోపయోగములగు పలువిషయము లిందుం జర్చింపంబడుచుండెను. ఇది ముఖ్యముగ నెల్లూరుతాలూకా కోవూరుగ్రామము కొఱకై పుట్టినది.

౧౨. హిందూబాంధవి:—దేశసేవాదీక్షం గొనిన చతుర్వేదుల వేంకట రాఘవయ్య ౧౯౦౩ ప్రారంభమున "హిందూబాంధవి" యను నొకతెలుంగు పత్రికను సాగించిరి. వీరు పత్రికాప్రచారమున ననుభవము కొంత సంపాదించి యటుపై స్వంతమున నీపత్రికం బెట్టిరి. పరాశ్రయమునం దత్యంతాసక్తివిశ్వాసములు లేనివా రగుటచేతను స్వాశ్రయబలము చాలమిని యథాపూర్వముగం బాఠకాదరరాహిత్యముచేతను నీపత్రికయుం జిరకాలజీవి కాంజాలకపోయెను. వేంకటరాఘవయ్యగా రిపుడును నెల్లూరునందు స్వారాజ్యపక్షమునం బాటు పడుచున్నారు.

౧౩. వైశ్యా-లాయలిస్టు:—కీర్తిశేషు లగునుంకు నారాయణస్వామిసెట్టిగారు ౧౯౦౬ లో వైశ్యోద్ధరణదీక్షతో 'వైశ్యా' యనువార్తాపత్రికను సాగించిరి. ఆకాలమున వంగదేశవిభాగమువలన దేశమున రాజకీయావేశము ప్రబలముగ నుదయించెను. శ్రీసెట్టిగారు ప్రభుత్వపక్షమువారై తమపత్రికకు లాయలిస్టు (Loyalist) అను నన్వర్థనామకరణముం జేసి ౧౯౦౮-౦౯ సంవత్సరములలో నెట్టకేలకుం బత్రికను జరుపుచుండిరి గాని యింతలో ప్రెస్ ఆక్టు అనుముద్రణశాసనము పుట్టుటవలన దీర్ఘాలోచనపరు లగుటచేం దమపత్రికను నిలిపివేసిరి. శ్రీసెట్టిగారు పసితనమున బి. యే. పరీక్ష నిచ్చి నెల్లూరిలో నుండిన F. C. M. పాఠశాలకు ౧౮౭౨ ప్రాంతములం బ్రథమసహోపాధ్యాయులుగ వచ్చిరి ఉపాధ్యాయత్వమున నుత్తము లని ఖ్యాతిం జెందిరి. వీరి ధైర్యస్థైర్యము లసామాన్యములు. మతబోధయే ప్రధానాంశముగం గలక్రైస్తవపాఠశాలపైం గినుకం బూని వీరు నెల్లూరిలో హిందూపాఠశాలను నిర్మించిరి. ఆపాఠశాలయే దినదిన ప్రవర్ధమానయై యీనాండు వేంకటగిరిరాజాగారి కాలేజియనుపేరం బ్రకాశించుచున్నది. వీ రుపాధ్యాయత్వమును ౧౮౭౯ ప్రాంతములం జాలించిరి. అయినను వీరిని జనసామాన్యము "బీయే నారాయణసెట్టిగారు" అనియే వ్యవహరించుచుండిరి. వీ రుపాధ్యాయత్వము వదలినవెనుక నెల్లూరిలో ప్లీడరుగనుండి యచ్చటినుండి శ్రీవెంకటగిరి సంస్థానమునకు దివాంజిగారై యచ్చటిరాజ్యభారమును శ్లాఘ్యముగనిర్వర్తించి పెత్తనమునం దిరుగ నెల్లూరుంజేరి పైని

జెప్పిన వైశ్యా-లాయలిస్టులఁ బ్రకటించి ౧౯౧౫ సంవత్సరమునఁ గీర్తిమూర్తి నలంకరించిరి.

౧౪. భవాని:—కొంచె మించుమించుగ "వైశ్యా" సమకాలీనముగ "భవాని" పత్రిక యొండు దాదాపు రెండుసంవత్సరములకాలము విలసిల్లుచుం డినది. ఈపత్రికాప్రవర్తకులగు మంగు వేంకటరామానుజరావుగారు వైష్ణవ పక్షపాతులగు గోల్కొండ తెగవారుగ నుండినను భవునిరాణికి "వైష్ణవి" యని యుఁ బేరుండినందునఁ గాఁబోలు "భవాని" నామమునుసహించి దానిం దమ పత్రికాపుత్రికానామధేయముం జేసిరి. రామానుజరావుగారు బహుశ్రుతులు. లోకానుభవజ్ఞులు. పత్రికానిర్వహణమునకుఁ జాలినవారు. తెనుఁగున గొప్ప పాండిత్యము గలవారు. ఇట్టివారి యుద్యమమయ్యు నెల్లూరిపాఠకుల సంకుచి తాభిమానమును వికసింపఁజేయ నసమర్థమై "భవాని" యగుట శివసాయు జ్యముఁ జెందినది.

౧౫. స్టూడెంట్సు మేగజైన్:—నెల్లూరు హైస్కూల్లవిద్యార్థులు కొం దఱు ౧౯౧౨-౧౩ సంవత్సరములందు "స్టూడెంట్సు మేగజైన్" (Students Magazine) అనునొక మాసపత్రికను ఇంగ్లీషునఁ బ్రకటింపఁ గలిగిన విద్యా బుద్ధులు గలవారుగ నుండిరి. వారిలో నొకరగు బిరుదవోలు ప్రసాదరావు గారిప్రశంస నెల్లూరిపత్రికాప్రకరణమునను గాననగు.

౧౬. నెల్లూరుపత్రిక:—అంతటఁ గొంతకాలము మాటుమడఁగియుండి హోమురూలు స్వారాజ్యసంవిధానములు వ్యాపింపఁదొడంగిన కాలమునఁ దిరుగ నెల్లూరుప్రాజ్ఞులు గొందఱు పత్రికాప్రచారముం దలపెట్టుకొనిరి. అది యటునిటు నూఁగి తుద కెట్టెట్టులో ౧౯౨౦ సం॥ ఫిబ్రవరి ౧౪-వ తేదిన "నెల్లూరుపత్రికా" రూపమున బహిర్గతమయినది. పత్రికాస్వరూపతత్త్వములఁ దెలిసికొనఁ గోరిన కొందఱు తదవతారప్రతిజ్ఞాప్రయోజనములపైఁ బ్రవర్తకు లతో నైక్యభావముం జెందఁజాలరైరి. అచిరకాలములోనే యీపత్రికగూడఁ గన్నులుమూసెను.

ప్రకృతమున వేంకటగిరిలో మ॥శ్రీ॥ నెమలి సుబ్బరావుపంతులుగారు "విద్యాభివర్ధని" యనునొక తెలుఁగుమాసపత్రికను బ్రచురించుచున్నారు. వీరు శ్రీవేంకటగిరిరాజమందిరమున నుండుకుమారవర్గమునకు విద్యాగురువులు (tutor) గ నున్నారు, వీరు విజ్ఞులు. తెలుఁగున గొప్ప సాహిత్యపరులు. విశేష మగునవభాషాభిమానము గలవారు. చదువరులు; సులభముగ గ్రహింపఁదగు

తేట. తెనుఁగున వినోదములగు విషయములను బురాణేతిహాసకథలను నీతిమత విషయములను వ్రాయుచుందురు.

మఱియుఁ గావలిలో మ॥ బ్ర॥ పిన్నమరాజు వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు గడచిన నవంబరునుండి "వర్ణాశ్రమధర్మసంస్థాపనము" అనుపేర నొకతెలుఁగు మాసపత్రికను బ్రకటించుచున్నారు. శర్మగా రాంధ్రగీర్వాణములందుఁ బ్రవేశము గలవారు. జ్యోతిషసిద్ధాంతమునఁ బ్రవీణులు. వీరు స్వయముగ నొక పంచాంగమును గుణించి ప్రకటించుచున్నారు. వీరిపత్రికయందు వర్ణాశ్రమ సంస్థితింగూర్చియు వైదికవిషయములం గూర్చియుఁ జర్చించుచుందురు. వీరు కావలి తాలూకా కచ్చేరిలో గుమాస్తాగానుండి పెన్షను పొంది వైదికమతా సక్తులై యున్నారు.

ఈవిచారముయొక్క నీతియేమి? యేఁబదిసంవత్సరములలోఁ బదునెని మిది పత్రికాపుత్రికలఁ గనిననెల్లూరు నేఁ డనపత్యురాలయి దైన్యముగనున్నది. నెల్లూరివార్తల నితరపత్రికలకు వ్రాసిన నవి శీఘ్రమున వెలువడుటలేదని విలేఖకులు కొందఱు తలవెట్టుకొనుట కేర్పడినది. స్వంతపత్రికలు వర్ధిల్లఁజేయు నభిమానము నాదరము నెల్లూరినెఱజాణలకు లేవు. పరాశ్రయము తృప్తికరముగ లేదు. ఈస్థితికిఁ గారణ మాలోచింప నిచటివా రేపనినైనఁ బూనికతోఁ జేయఁ గల మనోబల దేహబలములు గలవారు కారని తోఁచుచున్నది. సులభసాధ్యము లగునాటకకంపెనీలవలె వార్తాపత్రిక లాడి పాడి జీవింపఁ జాలవు. దృఢప్రయత్నము స్థిరప్రతిజ్ఞ యనన్యాభినివేశము సర్వతోముఖవైశారద్యము పత్రికా ప్రవర్తనకుఁ గావలయు. అత్యుష్ణప్రదేశ మగుటచే గాఢదీక్ష దుస్సహమై యంత టంతట శ్లథమై తరుగఁ దలయెత్తి కొలఁదికాలము ప్రవర్తించి మరల మ్లానమై పోవుచున్నది. ఇది గడ్డతీరు కాఁబోలు.

టెన్నిసన్‌గారి లోటస్ యీటర్సు (lotos eaters) వలె నేవిషయమునం దును గాఢప్రవేశము లేక పైపై నంటియునంటనటులు వర్తించుట సుకరముగఁ గన్పట్టుచున్నది. ఇప్పటి హిందూదేశస్థితినిబట్టి ప్రతిపెద్దయూర నొకవార్తా పత్రిక యున్న బాగుగ నుండు ననిపించుచున్నది. ఏయూరఁ జూచినను రాజకీయప్రశంసలు మెండగుచున్నవి. ప్రజలభావములు మాఱుచున్నవి. అచటనచట సంఘసంస్కరణోద్యమములు. బహిఃప్రకాశము లగుటకుఁ దగినంత సంవిధానము లేదు. ఇట్టిసంవిధానము వార్తాపత్రికలమూలముననే కావలయు.

నెల్లూరు ప్రజ్ఞాశూన్యము కాదు. ధనసంపద చాలియున్నది. మనుష్య బలమునకుఁ గొఱఁతలేదు. పత్త్రికాప్రవర్తనకుఁ గావలయు విషయసామగ్రియు బుద్ధియుక్తులును గలవారు లేరనఁదగదు. ఇన్నిసంపదలుండియుఁ బత్త్రికయే లలేదనఁ బ్రత్యుత్తర మెట్టిదిగ నుండునో? గుణదోషముల నెన్నఁ బనిలేదు. జనపతిహితకర్తృత్వమా లేక జనపదహితకర్తృత్వమా పత్త్రికామత మనియు విచారింప నక్కఱలేదు. పూనికతోఁ బనిచేయు ధీరుఁడు లేఁడని చెప్పవలసి యున్నది.

దీని కెట్లు ప్రత్యుత్తరము పుట్టునో చూతము.

వంగోలు వేంకటరంగయ్య.